# చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !






ఫలితమును చూడండి. బట్టలను ఆఖరు సారి జాడించునప్పుడు కొంచెము టినోపాల్ వేయండి. అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువ్వాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయ్యే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు వాష్‌కి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.

® టినోపాల్ జె.ఆర్. గైగి ఎస్.ఎ. వారి
స్విట్జర్లాండ్‌వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగి లిమిటెడ్, పి.ఒ. బాక్స్ 11050, బొంబాయి 20 బి.ఆర్.


అన్నపూర్ణా వారి
జైజవాన్
దర్శకత్వం: డి. యోగానంద్
నిర్మాత: దుక్కిపాటి మధుసూదనరావు. బి.ఎ.
NVKR
నవయుగ

# ఉత్తరాలు

ఆంధ్ర సచిత్ర వార పత్రిక 20—2—70 నాటి సంచికలో అగ్ర కులాల వారి నియంతృత్వాన్ని విమర్శిస్తూ చంద్రలేఖగారు ఒక లేఖ వ్రాశారు. అందులో ధర్మోపన్యాసాలు ఇస్తూనే కుల విచక్షణతో ఉన్నత పదవులలో తమవారిని ఎక్కించడము మన రాష్ట్రములో ముఖ్యముగా తెలంగాణ ప్రాంతములో ఎక్కువగా ఉన్నదని చంద్రలేఖగారు విమర్శించారు. ఈ లేఖ వ్రాయటంలో నేను వారితో వాగ్వివాదపడాలనికాని, వారిని విమర్శించాలనికాని నా ఉద్దేశ్యముకాదు. వారి లేఖ అతిశయోక్తులచే కూడుకొని యున్నదని తెలుపటమే నా ఉద్దేశము.

చంద్రలేఖగారు పరిస్థితిని సరిగ్గా అర్థము చేసుకొనలేదు అని నా అభిప్రాయం. అంతేకాకుండా వారి లేఖలో సంకుచిత్వము స్పష్టముగా కనపడుతున్నది. దేశమంతటా కుల మతముల అభిమానము రాజకీయములలో ప్రబలియున్నది. ఇది ఒక్క మనరాష్ట్రములోనేకాదు. చంద్రలేఖగారు తెలంగాణలో మరింత హెచ్చుగా ఉన్నదని ప్రత్యేకముగా విమర్శించడము వాస్తవానికి దూరమైనదని నా దృఢ నమ్మకము.

చంద్రలేఖగారు ఇందుకు ఉదాహరణముగా ప్రజాసమితి నాయకులను పేర్కొనడము శోచనీయము. ప్రజాసమితి నాయకులు రెడ్డిలే అయినను వారు దిగువ కులాలవారిని అణగద్రొక్కాలని ప్రయత్నించినట్లు దాఖలాలు ఏమీలేవు.

ఉభయ ప్రజాసమితి నాయకులు "రెడ్డిలు" అయినంతమాత్రాన దురుద్దేశ్యాలు అంటగట్టడము మంచిదికాదు. భారతదేశపు ప్రధానులుగా ఇంతవరకు వచ్చినవారు అందరూ ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి చెందినవారేకదా! అందుకు కారణము ఉత్తరప్రదేశ్‌రాష్ట్రము ఒక్కటే దేశము మొత్తముపై అధికారాన్ని చెలాయించటానికా? ఇతర రాష్ట్రాలను అణగద్రొక్కటానికా?

ఇక చంద్రలేఖగారు పోటీ ప్రజాసమితికి ఈమధ్య శ్రీధర్‌రెడ్డిగారి స్థానములో జరిగిన ఎన్నికను ప్రస్తావిస్తూ కాళోజి నారాయణరావును ఎన్నుకోవాలని కొందరు సూచించారట' అని అన్నారు. అంటే చంద్రలేఖగారిక్కి రూఢిగా తెలియదన్నమాట. రూఢిగా తెలియనప్పుడు పత్రికలలో వ్రాయడము మంచిదికాదు. అది కుల, మత వ్యవస్థను రెచ్చగొట్టడానికే ఉపయోగపడుతుంది.

నేనేమి అగ్రశ్రేణికులాలకు చెందిన వ్యక్తినికాదు. వెనుకబడిన కులాలకు చెందిన వ్యక్తిని. అగ్రశ్రేణి తరపున నేనేమి వకాల్తా పుచ్చుకొనలేదు. కులమతముల అభిమానము రాజకీయాలలో ప్రబలి దేశమంతటా ఉన్నది. ప్రత్యేకించి మన రాష్ట్రాన్ని ముఖ్యముగా తెలంగాణలో అంటూ చెప్పుకోవడానికి వీలులేదు. ప్రత్యేకించి ఒక వర్గాన్ని విమర్శించడము ద్వారా ప్రస్తుత పరిస్థితి మారదు. కాని ఆ యా వర్గాల మధ్య విద్వేషాలు ఏర్పడతాయి. అని చెప్పడమే నా ఉద్దేశ్యము.

జి. వి. రంజన్, (హైదరాబద్)

## కథలు

'అందని తారకలు' కథ చదివిన పిదప నాకీ ఉత్తరము రాయాలనిపించింది. రచయిత్రి నేటి సమాజములో ఆడపిల్లలకు జరుగుచున్న అన్యాయము చాల చక్కగా వర్ణించారు. రత్నమాల తండ్రిలాంటి సనాతన పరులు ఆచరించే నియమాలు నేటి సమాజానికి ఓ హారముగా ఉంటాయి. వారు ఆడపిల్లలను ఏవిధమయిన ఆటపాటలకు పోనీయరు. ఎప్పుడు నాలుగు గోడలమధ్య వారి ప్రపంచము. ఫలితముగా ఆడపిల్లలు మూగవోతారు.

—ఎన్. బి. ఋషి (కాన్సబహాలు, ఒరిస్సా)

* * *

సాధారణంగా భాషా వైషమ్యాలను తొలగిస్తూ, 'సమైక్యత'ను సాధించడానికే పత్రికలు కృషి చేస్తాయి, కాని మీ అభిమతం దీనికి పూర్తిగా విరుద్ధంగా వున్నట్టు మీరు ప్రచురిస్తున్న కథలను బట్టి అవగతమవుతూంది. ఎందుకు మీకీ పక్షపాతం. ఇరువురి మధ్యా 'వైషమ్యాలు'— పెంచడమే మీ వుద్దేశ్యమా? ఈ మధ్య ప్రచురించిన 'తుఫాన్' 'మనస్తంత్రి' దీనికి తార్కాణం కాదా? దీనిని మీరు ప్రచురించక పోయినా ఫరవాలేదు. (కనీసం అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తే చాలు.)

—మాధవీలత (కామారెడ్డి)

* * *

20వ తేదినాడు (20.2.70) తుఫాన్ అను పెద్దిభొట్ల సుబ్బరామయ్య వ్రాసిన కథను చదివితిమి. ఆతుఫాన్ అనుకథలోని సారాంశము చాల అన్యాయముగా వ్రాశారని మాకు, తోచింది. అది యేమనగా తెలంగాణా పోరాటంపై అనేక అపచారాలు మోపి వ్రాశారు. కాని నాద్వితీయ పుత్రుడు 11వ తరగతి చదువుచున్న బాలుడు ఈ పోరాటంలో పోలీసుల దురాక్రమణ వలన చనిపోయాడు. అందుచేత చాల విచారముగా నుండు సమయములో ఈ కథను చదవగానే నాలోనున్న రక్తము ఉప్పొంగి పోయినది. ఈ కథయొక్క రచయితపై కోపము వచ్చింది. కాని ఏమన లేక పోతున్నాను. తమరు ఈ తెలంగాణాపై ఇంత అన్యాయముగా వ్రాసినారు. వానిలో ఏదొకటైనా మీరు రుజువు పరుచ గలరా? కావున మాపై దయయుంచి ఇంకెప్పుడైనా ఏలాంటివైన అప

చాలా తెలంగాణాపై వ్రాయకూడదు అవ మాయొక్క మనవి.

——కె. రామలింగయ్య. (హైదరాబాదు)

* జవాబు

'ఆంధ్రప్రదేశ్' అనబడే రాష్ట్రంయొక్క ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావుగారు కొంతకాలం క్రితం చేసిన ప్రసంగం కొన్ని వారాల ముసుపు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో పడింది. అందులో వారు —ఎవరయినా అత్యాచారాలకి పూనుకుంటేవారు ప్రతిచర్యకిలోనయిన వారవుతారని చదువరులకి గుర్తు చేశారు.

కోట్ల విన్నచెప్పి అసహాయులయిన అల్పసంఖ్యాకుల మీద అత్యాచారాలు జరిపినవారు పోలీసు దౌర్జన్యం గురించి మాట్లాడటం వింతగా ఉంటుంది. యుద్ధం చేస్తామని రణరంగంలోకి దిగి 'శత్రువులు మమ్మల్ని హింసపెడుతున్నా'రని బాధపడేవారికి ఏమని చెప్పగలము?

బస్సులు, రైలుబళ్లు, కట్టడాలు మొదలయిన వాటిని నాశనం చెయ్యటం చట్టవిరుద్ధం. పోలీసులు వారి కర్తవ్యం నెరవేర్పటంలో ఆశ్చర్యంలేదు.

—జి. రామలింగం (మదరాసు)

## సీరియల్

కొత్త సీరియల్ సి. ఆనందరామం గారిది నన్నెంతో ఆకర్షించింది. ఈ సీరియల్, మనుషులు—మమతలు ఈ రెండు పత్రికకు రెండు అణిముత్యాల్లాంటివి. మనుషులు మమతలు అయిపోయిందని చూచిన తరువాత అప్పుడే అయిపోయిందా అనిపించింది. కథ మొదటి నుండి చాలా, ఇంట్రస్టుగా నడిపించుకొచ్చారు రచయిత్రి యుల మంచిలి రుక్మిణిలక్ష్మి గారు చక్కగా ముగించినారు. వారికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు తెలుపండి. మనుషులు మమతలు వాస్తవానికి చాలా దగ్గరగా, వుంది. ఈ సీరియల్ పాఠకుల హృదయాలలో మరుపురాని ముద్రగా నిలుస్తుంది.

పి. యం. శ్యామలాదేవి (రేపల్లె)

* * *

6—3—70 తేది ఆంధ్ర సచిత్రవారపత్రికలో ప్రచురితమైన గొలుసు నవల 'అపరాజిత' సీరియల్ అత్యద్భుతంగా వుంది. ముందుముందు కూడ యిలాగే వుండగలదని ఆశిస్తాను. ప్రచురించిన మీకూ, రచయిత్రుల గారికీ నా ప్రత్యేక అభినందనములు.

కె. వి. నాగేశ్వరరావు (నార్తురాజుపాలెం)

## వ్యాసాలు

సంవత్సరం క్రితం 3—1—69 ''ఆంధ్ర సచిత్ర వారపత్రిక''లో ''ధనవ్యామోహాన్ని రెచ్చగొడుతున్న లాటరీ'' అన్న వ్యాసంలో లాటరీలవల్ల కరిగే అనేక అనర్థాలను ఉదహరిస్తూ రచయిత సి. కనకాంబరరాజు గారు చాలా చక్కగా వివరించారు. ప్రజల్ని ఈ బారి నుండి రక్షించవ

# ఉత్తరాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ సందర్భంలో ప్రశంసించి తీరాలి అంటూ వ్యాసం చివరలో రచయిత వ్రాయటం, మీరు ఆ చిన్న మాటకు ఘనంగా శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఫోటోను ప్రచురించటం జరిగింది.

ఈ మధ్య కాలంలో మనరాష్ట్రంతో బాటు ఇంచుమించుగ అన్ని రాష్ట్రాలూ లాటరీలు నడపటం ప్రారంభించాయి. లాటరీలు వల్ల మంచి చెడ్డలు అనే విషయం అటుంచితే ఇతర రాష్ట్రాల లాటరీ టిక్కెట్లు మన రాష్ట్రంలో విపరీతమైన స్థాయిలో అమ్ముడు పోవటం, మనరాష్ట్ర లాటరీ టిక్కెట్లు మన రాష్ట్రంలోనే పెద్దగా అమ్ముడు కాక పోవటం, మన రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాలు హైస్కూల్సు లాటరీ టిక్కెట్ల విక్రయ శాలగా రూపొందటం జరుగుతోంది. ప్రముఖులా, శ్రోతలు కాని పరిమితి విధించాలో ఇతర రాష్ట్ర లాటరీలను నరికిస్తే మనకీ ఖర్మ వుండకపోను.

—కానూరి రాజేంద్ (కవుతరం)

## న్యూఢిల్లీ లేఖ

న్యూఢిల్లీలేఖలో వస్తున్న విమర్శ నిష్పక్షపాతంగా యుంటున్నది. శ్రీ కృష్ణ గారికి నా అభినందనలు.

—ముండూరు దుర్గారావు (చిల్కలూరిపేట)

## డాక్టరు కబుర్లు

సామాన్య పాఠకులకు, సామాన్య వైద్య విషయములు గురించి తెలుపుటయే మీ ''డాక్టర్, కబుర్లు'' శీర్షిక ఉద్దేశ మనుకుంటాను. కాని 20—2—70 పత్రికలో మీరు ప్రచురించిన నాడి లేకపోవుట (Pulseless disease) అనే స్థితి చాలా అరుదుగా వచ్చునది. అటువంటి విషయము గురించి కొందరు డాక్టర్లకే తెలియదు. అట్టిది సామాన్య పాఠకుల కెందుకో? పోతే అది తెలిసికొనుటలో సామాన్య పాఠకులకు ఒకే ఉపయోగము. హఠాత్తు ప్రమాదములో చిక్కుకొన్నవారికి నాడి (మణికట్టు) వద్ద లేకపోయినప్పుడు కంగారు పడకుండా ఇతర చోట్లలో (మెడ, ముఖము) చూడాలి. కాని ఈ విషయం శీర్షికలో వ్రాయలేదు. ఇకమీదట సామాన్యముగా జరుగు వైద్య విషయముల గురించి పాఠకులకు ఉపకరించు రీతిగా వ్రాయ ప్రార్థన.

వ. రజనీకాంత్, (మదరాసు)

( 64వ పేజీ చూడండి)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 27—3—'70

శ్రీసాధారణనామ సం॥ చైత్ర బహుళ॥ షష్ఠి,

సంపుటము : 63 సంచిక : 28

స్థాపితము :

1908

ముఖ్య సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము

7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13 00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక

# రయిల్వే బడ్జెట్ రాజకీయాలు...

పార్లమెంటు జరిపేసే ప్రజాస్వామ్యంలో శాసనసభలు తర్కించే ముందే బడ్జెటు ప్రతిపాదనలని సమర్పించటం ఇంతకి ముందు ఎరగము. పోను వారం నాడు రయిల్వేమంత్రి తన మొదటి బడ్జెటుని సమర్పించారు. రవాణా, ప్రయాణీకుల టిక్కెట్ల రేట్లని ఎందుకు పెంచాలో చెప్పారు. ఎంతో వివరంగా చెప్పారు.

అంతకి ముందు రయిల్వేల ఫైనాన్షియల్ కమీషనర్ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ కొన్ని సంగతులని వెల్లడించారు. 1968—69కి 10 కోట్ల రూపాయలు, 1967—68కి 31 కోట్ల రూపాయలు లోటు (రయిల్వేలకి) ఉంటుందని చెప్పారు. వరుసగా నాలుగు సంవత్సరాలు ఈ లోటు వస్తోందన్నారు.

అసలు బడ్జెటులో రు 22 38 కోట్ల మిగులు ఉండగా వీటిలో రు 3 63 రివెన్యూ రిజర్వు ఫండుకి, తక్కిన రు. 18 75 కోట్లు డెవలప్‌మెంటు ఫండ్‌కి జమ చెయ్యాలనుకున్నారుట. కర్చుకి సరిపోయేందుకు రు. 4 36 కోట్లు జనరల్ రిజర్వు నుంచి మార్చవలసి వస్తుందని శ్రీ సుందరరాజన్ అన్నారు. రు. 1525 కోట్ల ఖర్చులో రయిల్వేలు రు 940 కోట్లు సంపాదించుకోవలసి వస్తుందని నాలుగవ ప్రణాళికని తయారు చేసిన వారు నిర్ణయించారుట. వీటిలో (రు 940 కోట్లలో) రు 150 కోట్లు రవాణా, ప్రయాణీకుల టిక్కెట్ల పెంపు వల్ల వచ్చేవిట.

## శ్రీ డాంగే హెచ్చరిక

లోక్‌సభలో కుడి కమ్యూనిస్టు పార్టీ నాయకుడు శ్రీ ఎస్ ఏ డాంగే ప్రయాణీకుల టిక్కెట్ల రేట్లు పెంచ కూడదన్నారు. పెద్ద నగరాల పొలిమేరల నుంచి వచ్చేవారికి ఇవి పెద్ద ఇక్కట్లుగా ఉంటాయన్నారు.

ఒక కమ్యూనిస్టు పార్టీ పేపరు ఈ విషయం గురించి ఇలాగ రాసింది—

“ప్రజలకి నచ్చాలంటే బడ్జెటు ప్రతిపాదనలని బాగా మార్చి వేయాలి. మూడవ తరగతి ప్రయాణీకుల టిక్కెట్ల ఖరీదులు పెంచటం న్యాయం కాదు. పయి తరగతుల వారి టిక్కెట్ల ఖరీదులు తగినంతగా పెంచలేదు. మూడవ తరగతి వారి కర్చులు పెంచటంవల్ల రు. 8.25 కోట్లు పెరగవచ్చు, కాని, ఈ మొత్తం అవసరమయినది కాదు. ఇది రు 22 38 కోట్ల మిగులుని తగ్గిస్తుంది. అంతే పయి తరగతుల టిక్కెట్ల ఖరీదులని ఇంకా పెంచి ఈ తగ్గింపుని కొంతదాకా భర్తీ చెయ్యవచ్చు.

“చేసిన తప్పుని ఒప్పుకుని రయిల్వే బడ్జెటుని సవరించటంలో తప్పులేదు. ఈ విధమయిన సవరింపు బొంబాయిలో పరిపాలక వర్గంవారు చేసిన ఉదాత్తమయిన భావాలకి అనుగుణంగా ఉంటుంది.”



ఊపస్ విస్కీవారు, గోద్రెజ్ వారు కలిసి ఏర్పాటుచేసిన సింధూరాణి పోటీలో గెలుపొందిన కుమారి పెర్సిస్ పటేల్. ఎడమవైపున మొదటి రన్నర్ అప్‌గా వచ్చిన కుమారి నళినీమణి, కుడివైపున రెండవ రన్నర్ అప్‌గా వచ్చిన కుమారి తస్నీమ్ ఫకీర్ మహమ్మద్.

## ఉపసంహరణ

ఒకవారం తర్వాత, మార్చి 4 నాడు లోక్‌సభ రయిల్వే బడ్జెటు చర్చకి సిద్ధమవుతూ ఉండగా శ్రీ నందా మూడవ తరగతి టిక్కెట్ల హెచ్చింపుని ఉపసంహరించుకున్నారు. ప్లాట్‌ఫారమ్ టిక్కెట్ల ధరలని కూడా పెంచమని వెల్లడించారు. ఆహారధాన్యాలు, పప్పు దినుసులు, పాల పొట్లాల పార్సెల్ చార్జీల సవరింపు వీటి విషయములో కూడా మార్పులు ఉండవన్నారు.

ఈ ఉపసంహరణల ప్రభావం ఏవిధంగా ఉంటుంది? ఈ ఏడు ఆదాయం అనుకున్న దాని కన్నా రు. 13 కోట్లు తగ్గుతుంది. 1970_71కి లోటు సుమారు 15 కోట్ల రూపాయలు అవుతుంది.

ప్రణాళికాసంఘంవారి అంచనాల ప్రకారం రయిల్వేలు మొదటి రెండు సంవత్సరాలూ ప్రణాళికకి రు. 120.37 కోట్ల బదులు రు. 41.90 కోట్లు మాత్రమే ఇవ్వగలుగుతాయని కూడా తెలుస్తోంది.

టిక్కెట్ల వెలలు ఎందుకు పెంచాలో శ్రీ నందా సహేతుకంగా వివరించారు. “రవాణా రేట్లు బాగా పెంచితే ఆర్థిక పరిస్థితిలో ద్రవ్యోల్బణ ధోరణి అధికం అవుతుంది. టిక్కెట్ల వెలని పెంచితే ఇది జరగదు. అందుచేతనే ప్రయాణీకులకి లభ్యమయ్యే వసతులు తగ్గించాలి” అన్నారు. పెద్ద నగ

రాల సరిహద్దులనుంచి వచ్చే (సబర్బన్) ప్రయాణీకులు మొత్తం ప్రయాణీకుల సంఖ్యలో సగం దాకా ఉంటారుట. కాని, ప్రయాణదూరం లెక్క వేస్తే వారి వాటా 18 శాతం మాత్రమే ఉంటుందిట. ఇక రాబడిచూస్తే అది 10 శాతం మాత్రమే. దూరం, రాబడి ఇంత తక్కువగా ఉన్నప్పటికీ వీరికి చేకూర్చవలసిన సదుపాయాలుమాత్రం చాలా ఎక్కువగా ఉంటాయి. ఎందుచేతనంటే, ఈ రకం ప్రయాణీకుల రద్దీ ఉదయం, సాయంత్రం మాత్రం అత్యధికంగా ఉండి తక్కిన కాలాలలో తక్కువగా ఉండడంచేత యంత్ర సామగ్రి వినియోగం తక్కువ. అంతేకాక ఈ రకం సబర్బన్ లేక సరిహద్దు ప్రయాణీకుల సంఖ్య తక్కిన రకాలవారి సంఖ్యలకన్నా అతి శీఘ్రంగా పెరుగుతోంది. దీనివల్ల వ్యయం కూడా అతిశీఘ్రంగా పెరుగుతోంది.

## మూడవతరగతి

ఈ రకం ప్రయాణీకులు ఎక్కువగా మూడవ తరగతికి చెందినవారు. మొత్తం ప్రయాణీకుల సంఖ్యలో మూడవ తరగతివారు 98.5 శాతం మంది ఉన్నారు. వీరిలో 12.5 శాతం మెయిలు, ఎక్స్‌ప్రెస్‌లలో వెళతారు. 86 శాతం మామూలు బళ్లలో వెళతారు. అయితే మెయిలు, ఎక్స్‌ప్రెస్ బళ్లలో వెళ్లే ప్రయాణీకులవల్ల వచ్చే రబడి మొత్తంలో 40 శాతందాకా ఉంటుంది. మామూలు రయిళ్లలో ప్రయాణంచేసే వారివల్ల వచ్చే ఆదాయం 48 శాతం మా త్రమే. పయి తరగతులలో వెళ్లే ప్రయాణీకుల సంఖ్య 1.5 శాతందాకా మాత్రమే ఉంటుందికాని వారివల్ల వచ్చే రాబడి 12 శాతం ఉంటుంది. దీనంతటినీ పరిశీలిస్తే ఆదాయం పెంపకానికి మూడవ తరగతి టిక్కెట్ల ధరలు పెంచటంకన్నా వేరే మార్గం లేదని గ్రహించవచ్చు'' అన్నారు రయిల్వేమంత్రి.

'ఇది అధికారులు తయారు చేసిన బడ్జెటు' అని శ్రీనందా వాదించారు. ఆయన గనుక కేంద్ర మంత్రివర్గంలో రయిల్వే పోర్ట్‌ఫోలియోని స్వీకరించకుండా ఉంటే ఈ రకం వాదం అవసరమే అయ్యేది కాదు. పరిపాలన, మంత్రివర్గంలోఉమ్మడి బాధ్యతలు—ఇవన్నీ శ్రీ నందాకి తెలియని విషయాలు కావు. ఆయన ఎన్నో సంవత్సరాలు మంత్రిగా ఉన్నారు. రయిల్వే బడ్జెటుని కేంద్ర మంత్రివర్గం వారందరూ కలిసి ఆమోదించి ఉండాలి. అసలు ఆయన మంత్రివర్గంలో చేరిన తర్వాతనే ఆమోదించటం కూడా జరిగిందేమో. మొత్తంమీద, మూడవ తరగతి టిక్కెట్ల ధరలు హెచ్చింపుకు కారకులయినవారిలో ప్రధానమంత్రితో సహా కేంద్ర మంత్రివర్గం సభ్యులు అందరూ ఉండి ఉండాలి

## పొదుపు-సాహసం

**రయిల్వేలవారు అన్ని విధాలా పొదుపు చెయ్యటానికి ప్రయత్నిస్తారని శ్రీనందా పార్లమెంటులో** చెప్పారు. ఇది మూడవ తరగతి టిక్కెట్ల ధరల పెంపకానికికన్నా ఎక్కువ సాహసం కావలసిన కార్యక్రమం...

ఈ విషయాలన్నీ నాలుగవ ప్రణాళికకి ముడి పడి ఉన్నవి. ప్రణాళిక త్వరలో పార్లమెంటులో చర్చకి వస్తుంది. ఇంతకిముందే చెప్పిన రు. 940 కోట్లలో రు. 150 కోట్లు టిక్కెట్ల ధరల హెచ్చింపువల్లా, రు. 525 కోట్లు రిజర్వు ఫండ్సు డిప్రీసియేషన్‌వల్లా, రు. 265 కోట్లు ఆదాయం మిగుళ్లవల్లా వస్తాయని అంచనా. ఈ అంచనాలు నిజం అవుతాయా! పయి సంవత్సరం ప్రణాళికా వ్యయంలో రయిల్వేల భాగం రు. 31.96 కోట్లు మాత్రమే ఉంటాయి. (రు. 44.96 కోట్లు ఉంటాయని మొదట అంచనా వేశారు.) శ్రీనందా ప్రతిపాదనల ప్రకారం రయిల్వేలవాళ్లు ప్రణాళిక చివరి మూడు సంవత్సరాలలో రు. 200కోట్లు తేగలగాలి.

## *1971*

రెండు గత్యంతరాలు ఉన్నాయి. ఒకటి, 1971 కి ప్రభుత్వం కమ్యూనిస్టులమీద ఇంతగా ఆధారపడ నవసరం లేకపోవచ్చు. మధ్యంతర ఎన్నికల తర్వాత నిలకడ ఎక్కువ కావచ్చు. (ఇవి జరిగి తీరుతాయని తోస్తుంది. కమ్యూనిస్టుల వత్తిడి వీటికి దారి తీస్తుంది.)

రెండు, అవసరాన్నిబట్టి ప్రణాళికనే మార్చుకొనవచ్చు. 1962 లో చెయినా భారతదేశంమీద దాడి చేసినపుడు ప్రణాళికల వ్యయాలని గురించి అందరూ కొంతకాలం మర్చిపోయారు. అప్పుడు ప్రణాళికా సంఘానికి ఉపాధ్యక్షుడు శ్రీ గుల్జారీలాల్ నందాగారే. మొన్న చేసిన ఉపసంహరణల తర్వాత ప్రణాళిక స్వరూపాన్ని సమీక్షించటం అవసరం అవుతుంది. అభివృద్ధికి అవసరంకాని ప్రాజెక్టులని ఎన్నిటినో వదులుకొనవచ్చునని శ్రీ నందగారు తెలుసుకోగలరు. ●

# రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పివంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినటయితే వ్రాతప్రతులు తిప్పివంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పివంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పివంపే ప్రయత్నాలు చేస్తాము; కాని, వాటి విషయమంతా, ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్ర సచిత్ర వారపత్రిక*



రసజ్ఞ

◙ చిమ్మచీకట్లైనా చిన్న కాంతి కిరణా నికి లోకువే! కిటకిటలాడే థర్డ్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో ఒదిగి కూర్చొని, కిటికీలోంచి తల బయటపెట్టి చీలి పోయే చీకట్లని చూస్తున్న శారద వద నంలో ఆశారేఖ తళుక్కుమంది. ఈ ఇంటర్‌వ్యూలో తను కృతకృత్యురాలైతే చదువు కొనసాగుతుంది. అప్పైన ఏదో మంచి ఉద్యోగమే దొరక్కపోదు, సంపా రాన్ని ఆవరించిన నిరాశ తొలగిపోతుంది. అమ్మ, చెల్లెళ్ళు, తమ్ముడు—అందరూ కళకళలాడే ముఖాలతో ఆనందజ్యోతుల్ని వెలిగిస్తారు.

ఫోర్‌డాన్ హౌరామెయిల్ చీకట్లని నెట్టుకుంటూ మరో ప్రపంచాన్ని చేర బోతున్నట్లు ఉత్సాహంగా చకచక ముందుకి సాగిపోతోంది.

'టికెట్ ప్లీజ్, టికెట్.'

థర్డ్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ పుష్పవి మానం. చీమకూడా దూరరాని చిట్టడక లాంటి ఆపెట్టెలో ఎలాగో సందు చేసు కొని టి.టి.ఇ. అభిమన్యుడులా జొర బడ్డాడు.

'టికెట్.'

రాత్రి పదిగంటలు దాటుతోంది. రక రకాల భంగిమల్లో సజీవచిత్రాల్లా ఉన్న ప్రయాణీకులు విసుక్కుంటూ టికెట్లు వెతుక్కొని ప్రదర్శిస్తుంటే, టి.టి.ఇ. చెకింగ్ పెన్సిల్‌తో వాటికి అలంకారాలు దిద్దుతున్నాడు.

'టికెట్ ప్లీజ్.'

శారద ప్రక్కన పెట్టిన హాండ్‌బ్యాగ్ కోసం చూసింది. ఆమె గుండె గతుక్కు మంది. గాభరాగా అటూ ఇటూ చూసింది. లేచి నిలబడ్డది. చీరె కుచ్చెళ్ళు దులి పింది. సీటుకింద చూసింది. ఆమె కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగయి.

'హాండ్‌బ్యాగ్ పోయిందండీ' కలవర పాటుతో అంది.

'ఎక్కడికిపోతుంది? సరిగా చూడండి.' టి.టి.ఇ. విసుక్కున్నాడు.

పక్కన ఉన్నవాళ్ళు ఆమెవైపు కుతూహలంగా చూశారు. కొందరు వెతు కుతూ సాయం చేయమాశారు.

'ఇంతకిముందు నా పక్కనే సీటుమీదె ఉందండీ.' అంది శారద గాభరాగా.

'పోయిన స్టేషన్లో, ఇక్కడనిలబడ్డ కుర్రాడు దిగాడు. ఇంకేం వాడిపనే అయి ఉంటుంది. వాడి చూపులుచూసి అప్పుడే అనుమా నించాను'. ముతక దుస్తులు ధరించి ఈ వ్యవహారాన్ని గమనిస్తున్న ఒక వయసుమళ్ళిన వ్యక్తి ఆ చూ కీ ఇస్తున్న ధోరణిలో అన్నాడు.

'నెక్స్ట్ స్టేషన్లో రిపోర్టివ్వండి.' అన్నాడు టి. టి. ఇ.

'ఆఁ—రిపోర్టిస్తే మాత్రం దొరుకు తుందే! నీళ్ళధారే! డబ్బేమాత్రం ఉందమ్మాయ్?' విచారించాడు మరో ఆసామి.

'సుమారు యాభై రూపాయిలుంటా యండీ. టికెట్టు కూడా అందులోనే ఉంది.' గద్గదికంగా అంది శారద.

టి. టి. ఇ. తనకిదేం పట్టనట్టు రిజర్వేషన్‌ తెరిచి, 'ఎక్కడికి వెడు

తున్నారు ?' అన్నాడు.

'భువనేశ్వర్' అంది శారద హీన స్వరంతో.

'ఎక్కడినించి వస్తున్నారు ?'

'రాజమండ్రి'.

టి. టి. ఇ. గెడ్డం తిరగేసి, నోటి లెక్క చేస్తున్న ధోరణిలో భ్రుకుటి ముడచి 'పంతొమ్మిదీ డెబ్బయి అయిదు ఇవ్వాలండీ.' అన్నాడు.

శారద నిలువునా వణికింది.

'లేదండీ. ఉన్న డబ్బంతా అందులోనే ఉంది. నా అడ్రసు ఇస్తాను. ఇంటికి వెళ్ళింతరవాత ఎం. వో. చేస్తానండీ.' అంది శారద అమాయికంగా.

**టి. టి. ఇ. ఆమెవైపు తేరిపార చూశాడు. ఏ బ్యూటీ! కాని డ్యూటీ డ్యూటీయే!**

'సారీ. వీల్లేదండీ. ఛార్జి ఇవ్వక పోతే వచ్చే స్టేషన్లో పోలీస్‌కి హేండోవర్ చెయ్యవలసి వస్తుంది.'

శారద కంపించింది.

'పోనీ ఈ రిస్ట్‌వాచీ తీసుకొని, ఛార్జి పోను మిగతా డబ్బివ్వండి.'

చేతికిగల రిస్ట్‌వాచీ తియ్యబోయిందామె.

'అది పోలీసువారు చూసుకుంటారు. నాకు సంబంధం లేదు.' అన్నాడు టి. టి. ఇ.

శారద నిస్సహాయంగా అతనివైపు చూసింది. కుడిచేతికి ఒక గాజు ఉంది.

'పోనీ ఈగాజు...'

'సారీ'

ఆమెకి ఏడుపు వస్తోంది. ఎవరైనా సహాయం చేస్తారేమోనని చుట్టూ చూసింది. తమకేం పట్టనట్టు అందరూ నోరు మెదపకుండా . చోద్యం చూస్తూ కూర్చున్నారు.

'మరెలా?' అంది శారద అమాయికంగా.

'వచ్చేది కుర్దారోడ్ స్టేషన్ అక్కడ ఎస్. ఐ. కి చెప్తాను.' అన్నాడు టి. టి. ఇ.

శారద భయంగా అతనివైపు చూసింది.

'ప్లీజ్ హెల్ప్‌మి.'

టి. టి. ఇ. షివల్రీ లేనివాడు కాదు. కాశీ మజిలీకథ లెన్నో అతని మనోవీధిలో గిర్రున తిరిగాయి. తెలుగు సినిమాల్లో, నవలల్లోని ప్రేమఘట్టాలూ వరసగా కళ్ళముందు గోచరించాయి. దురదృష్టవశాత్తూ తనకి పెళ్ళయి పోయింది! ప్రయోజనం లేదు. పోనీ ఆమెని వదిలేస్తే భువనేశ్వర్‌లో ఆమె స్టేషన్‌దాటి ఎలా వెడుతోంది! అక్కడ పట్టుకుంటే తన ప్రమత్తత రికార్డులోకి ఎక్కదూ! తన డ్యూటీ కుర్దారోడ్ స్టేషన్‌తో ఆఖరు. వచ్చే టి. టి. ఇ. తో చెప్తే!

'భువనేశ్వర్‌లో చుట్టాలు ఎవరైనా ఉన్నారా?'

'లేరండీ ఇంటర్వ్యూకి వెడుతున్నాను'

'ఇంటర్వ్యూయా? ఏ ఇంటర్వ్యూ!'

**'బి. ఇడి ఇంటిగ్రేటెడ్ కోర్సుకి అప్లయి చేశానండీ. రేపు పదింటికి ఇంటర్వ్యూకి రమ్మని రాశారు' అంది శారద.**

భువనేశ్వర్‌లో ఈమె డబ్బులేకుండా ఎలా నెట్టుకొస్తుంది? తిరిగి రాజమండ్రి వెళ్ళటానికి డబ్బెక్కడినించి వస్తుంది? ఒకవేళ ఏదైనా అమ్మదలిస్తే మాత్రం ఆమెవల్లవౌతుందా! టి. టి. ఇ. ఆలోచనలో పడ్డాడు. పోనీ, తను సహాయం చేద్దామంటే, రోజా ఖర్చే అంతంత మాత్రం.

టి. టి. ఇ. మౌనం చూసి కొంచెం ధైర్యం తెచ్చుకొంది శారద.

'రేపు ఇంటర్‌వ్యూకి వెళ్ళకపోతే సీటు పోతుందండీ. తరవాత చాలా కష్టాలు పడాలండీ' ప్రాధేయపూర్వకంగా అందామె.

'ఇన్‌స్పెక్టర్‌గారూ, ఆడకూతురు అలా బతిమాలుతుంటే, విడిచిపెట్టెయ్యకూడదూ? మీ డబ్బెక్కడికిపోతుంది? ఇంటికి వెళ్ళిం తరవాత పైసల్తో సహా మనీఆర్డర్ చేసేస్తుందిలెండి ఆ అమ్మాయి' శారద తరపున వకాల్తా పుచ్చుకొన్నాడు ఒక దయామయుడు.

'భువనేశ్వర్‌లో మీరు డబ్బు లేకపోతే అవస్థ పడతారు. అదీకాక నేను విధ్యుక్త ధర్మం నెరవేర్చక తప్పదు. ఈ రాత్రికి కుర్దారోడ్ స్టేషన్లో ఉండిపొండి. ఎస్. ఐ. గారితో మాట్లాడి ఏదో చేద్దాం' అన్నాడు టి. టి. ఇ.

'ఏదో చేద్దాం' అనే అతని మాటలు శారదకి కొండంత ధైర్యాన్నిచ్చాయి, చూస్తే ఇతను మంచివాడిలాగే ఉన్నాడు.

'దయచేసి రిస్ట్‌వాచీ అమ్మిపెడితే—'

'చూద్దాం.' అన్నాడు టి. టి. ఇ.

కుర్దారోడ్ స్టేషన్ వచ్చింది. టి. టి. ఇ. తో సహా శారద రైలు దిగింది.

'రండి' అన్నాడు అతను.

'ఏమండీ, ఈ రాత్రంతా పోలీస్ స్టేషన్లో ఉండాలా?' అంది శారద బెరుకుగా.

'దగ్గర్లో రైల్వే డాక్ బంగళా ఉంది. అక్కడ పడుకోవచ్చు. ఎవరి దగ్గరైనా అప్పు దొరుకుతుందేమో చూస్తాను. పొద్దున్నే భువనేశ్వర్ వెళ్ళుదురుగాని. ఎంతో దూరంలేదు. బస్సులో వెళ్ళొచ్చు. రాజమండ్రి వెళ్ళగానే ఎం. వో చేద్దురుగాని.'

అతని మాటలు కర్ణరసాయనంగా వినిపించాయి ఆమెకి. కృతజ్ఞతతో అతడికి లోలోపలే నమస్కారం చేసింది.

'మీ సహాయం మర్చిపోనండీ. మరొకరైతే—' ఆమె వాక్యం పూర్తిచేయ లేదు.

'ఫరవాలేదు.' అన్నాడతను.

శారదకి కొంచెం చొరవ కలిగింది.

'ఏమండీ, అయితే పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళక్కర్లేదుకదూ?'

టి.టి.ఇ. కొంచెం ఇరుకునపడ్డాడు.

'కాని డ్యూటీప్రకారం—'

'మీరు అప్పు ఇప్పిస్తానన్నారుగా. ఛార్జి చెల్లిస్తే ఇంక మీ విధ్యుక్త ధర్మానికేం భంగం?'

అతను నవ్వాడు.

'సరే. స్టేషన్లోకి వెళ్ళి వస్తాను. నా డ్యూటీ ఇక్కడితో ఆఖరు. ఇక్కడే ఉండండి. అన్నట్టు మీ పేరేమిటి?' శారద చెప్పింది.

టి.టి.ఇ. త్వరత్వరగా టి.టి.ఇ. రూమ్‌లోకి వెళ్ళాడు. శారదపోయిన ధైర్యం కూడతెచ్చుకుంటూ జనాన్ని చూస్తూ అలాగే నిలబడ్డది.

కొద్దినిమిషాల్లోనే అతను తిరిగి వచ్చాడు. వస్తూనే ఆమెచేతికి ఓ రసీదూ, కరెన్సీనోట్లూ, చిల్లరా ఇస్తూ అన్నాడు.

'ఓ యాభై దొరికాయండీ. పంతొమ్మిదీ డెబ్బయి అయిదు పోను, ముప్ఫయి ఇంపై అయిదు. చూసుకోండి.'

కృతజ్ఞతాభారంతో ఆమెతల వొంగింది.

'మీ ఋణం ఎన్నటికీ తీర్చుకోలేనండీ. దయచేసి మీ అడ్రసు ఇస్తారా!'

టి. టి. ఇ. కొంచెం నిర్లక్ష్యంగా రైల్వేగైడ్‌లో ఓ మూల కాస్త కాగితం చింపి తనపేరూ, అడ్రసూ రాసిచ్చాడు.

'హలో గోపాల్' అంటూ అదే సమయంలో ఓ టి. సి. అతని బుజంమీద చరిచాడు.

'హలో బ్రదర్' అన్నాడు టి. టి. ఇ. గోపాల్.

'వీ రెవరు ?'

'తెలిసిన వారులే. డాక్ బంగళాలో రూమ్ ఖాళీగా ఉందా ?'

'ఆ' అంటూ టి. సి. అతనివైపు కొంచెం వింతగా చూసి నవ్వాడు. నవ్వుతూ శారదవైపు కొంచెం చులకనగా చూశాడు. అతని వైఖరి ఆమెకి నచ్చలేదు.

'రండి—డాక్‌బంగళా చూపిస్తాను.' దారితీశాడు గోపాల్. శారద అతన్ని అనుసరించింది.

దారి సరిగాలేదు. డొంకలా ఉంది. చుట్టూ చెట్లు. అక్కడక్కడ వెలిగే దీపాలు దారిని అస్పష్టంగా చూపిస్తున్నాయి. గోపాల్ ఆమెపక్కనే నడుస్తున్నాడు. టి. సి. చూపిన వింతచూపు అతన్ని కలవర పెట్టింది. శారదవైపు

# నేల నింగి

అప్పుడప్పుడు చూడసాగాడు — ఆమె సూటిగా ముందుకిచూస్తూ నడుస్తోంది. చీకట్లో ఆమె పక్కన తను ఆవిధంగా ఒంటరిగా నడవటం ఎవరైనా చూస్తే ఏమనుకుంటారో ? ఏదో చిత్రమైన భావం కలుగుతోంది. ఇంతసేపూ ఆమెతో మాట్లాడినా వ్యవహారంతప్ప మరో ఆలోచనే రాలేదు. చీకటీ, ఒంటరితనమూ ఎందుకో కవ్విస్తున్నాయి. ఆలోచనల్ని బలవంతంగా నిలదొక్కుకున్నాడు.

బంగళా సమీపించింది. దొరల ప్రభుత్వం రోజుల్లో కట్టించిన ఆ బంగళా పాతకాలానికి ప్రతినిధిగా ఉంది.

'దండం బాబూ' అన్నాడు చౌకీదారు.

'రూమ్ ఖాళీగా ఉందా ?' అన్నాడు గోపాల్.

'చిత్తం బాబూ' అని వింతగా చూశాడు ఆ ఇద్దరివైపూ చౌకీదారు.

'లోపలికి రండి.'

'ఒక్కటే రూమ్ ఖాళీగా ఉందిబాబూ రెండోరూమ్‌లో ఎవరో ఒకాయన ఇంతకి ముందే వచ్చారు' అన్నాడు చౌకీదార్.

'సరే. మీరీ గదిలో పడుకోండి శారదగారూ. నేనిక్కడ వరండాలో పడుకుంటాను. లోపల గడియ వేసుకోండి.' అన్నాడు గోపాల్.

శారద గదిలోకి ప్రవేశించింది.

'చౌకీదార్, ఆగదిలోని బల్ల వరండాలోకిపట్టు. ఇక్కడ పడుకుంటాను' అన్నాడు గోపాల్. చౌకీదార్ బల్లదిగలోంచి బరబర లాగాడు. ఆ చప్పుడుకి రెండోగదిలోని వ్యక్తి బయటికి వచ్చాడు.

'ఎవరు? టి. టి. ఇ. గరా? ఏం సార్ నైన్టీనైన్ అప్‌కి కటక్‌దగ్గర మైనర్ యాక్సిడెంటయిందిట. రాత్రి ఒంటి గంటకయినా వాస్తుందంటారా?'

టి. టి. ఇ. అతన్నితేరి పారచూశాడు. పొడుగ్గా నల్లగా బలిష్టంగా ఉన్నాడు. కోరమీసాలు గాంభీర్యాన్ని కలగచేస్తున్నా, పెదవుల్లోని వంకరతనం కొంత క్రౌర్యాన్ని స్ఫురింప చేస్తోంది.

'సారీ ఎంక్వయిర్ చేయలేదుసార్' అన్నాడతను.

'ఒంటిగంట కొస్తుందట చౌకీదార్. మర్చిపోకుండా లేపవోయ్' ఆజ్ఞాపించే స్వరంతో అన్నాడతను.

'చిత్తం' అన్నాడు చౌకీదార్.

'అదేసమయంలో శారద బయటికి వచ్చింది.

'తలుపుకి లోపల గడియ లేదండీ'

ఆమె తియ్యని కంఠస్వరమూ, మెరుపులా జిగేలుమని మెరిసిన ఆమె విగ్రహమూ రెండోగదిలోని వ్యక్తిని ఆకర్షించాయి.

'ఈ గదిలో తలుపులకీ గడియ లేదు. ఇవన్నీ పురాతత్వ శాస్త్రజ్ఞులకి ఉపకరించటానికేగాని మనకోసం కావు.' అన్నాడు వెడవెడ నవ్వుతూ ఆ వ్యక్తి.

'తలుపులు జేరవేసి కుర్చీ ఆనించి పడుకోండి.' అన్నాడు గోపాల్ శారద ఆపనిలో నిమగ్నురాలైంది.

'వారు మీ—' సందేహంగా ఆగాడు ఆ వ్యక్తి.

'పాసెంజర్. తెల్లారి భువనేశ్వర్ వెడతారట.' అన్నాడు గోపాల్.

'ఐసీ, ఐయాం ప్రకాష్ ఇంజనీరింగ్ కంట్రాక్టర్'

'గ్లాడ్‌టు మీట్‌యూ.'

'మీరీగదిలో పడుకోవచ్చండీ. నేనోగంట ఆగి స్టేషన్‌కి వెళ్ళిపోతాను' అన్నాడు ప్రకాష్.

'థాంక్స్. కాని ఇక్కడే కాస్త గాలి



...స్తూంది.' అంటూ గోపాల్ [illegible] విప్పదీసి బల్లమీద పడుకున్నాడు. ప్రకాష్ లోపలికి వెళ్ళిపోయాడు. శారద తలుపులువేసి, కుర్చీ ఆనించి బల్లమీద శరీరం వాల్చింది.

గాలి చల్లగా వీస్తున్నా గోపాల్‌కి నిద్రరావటం లేదు. నిమిషాలు గడిచిపోతున్నాయి. ప్రకృతి మాటు మణిగి ఉంది. అప్పుడప్పుడు స్టేషన్లో గంటల చప్పుడూ, ఏ గూడ్స్‌ట్రెయినో పోతున్న ధ్వని తప్ప మరే సందడీ లేదు. శారద సుందరవిగ్రహమే ఎన్నో భంగిమల్లో గోపాల్ మనోరంగంమీద నృత్యంచేస్తోంది. ఆ నొక్కు నొక్కుల శిరోజాలూ, తెల్ల చీర, కంపించే పెదవులూ, ఆ యవ్వనపు వొంపుసొంపులూ—అతన్ని పిచ్చెక్కిస్తున్నాయి. ఆమె ఒంటరిగా ఉంది. తనకి ఋణపడి ఉంది, ఆ సన్నటి నడుం చుట్టూ చెయ్యేసి ఒక్కసారి బిగికౌగిలిలోకి లాక్కుంటే—! ఆలోచనలతో తల వేడెక్కిపోతోంది. ఉహూ, ఇక తన వల్లకాదు. ఏమైనాసరే ఆ కవ్వించే నవయవ్వనం—

బల్లమీద కదిలాడు గోపాల్. ఎవరో తనబల్ల పక్కగా నడిచినట్టు అనుమానం కలిగింది. ఏదో కిరకిర చప్పుడు. కటిక చీకటిగా ఉంది. అతను గదిలో లైటు ఆర్పివేసి నట్టున్నాడు. వరండాలో లైటు లేదు. అబ్బ. రెచ్చగొట్టే చీకటి—తలుపులకి గడియలు లేవు—గోపాల్ బల్లమించి లేచాడు.

ఉన్నట్టుండి నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఓ కేక ! గుండెల్ని చీల్చివేసే ఆర్తనాదం ! అందులో నిస్సహాయత, భయం, కోపం, కసి ?

గోపాల్‌కి మతిపోయింది. ఆ కేక ఎక్కడినించి వచ్చిందో ఒక్క క్షణం పోల్చుకోలేక పోయాడు.

మళ్ళీ కేక—కలియబడుతున్నచప్పుడు, చప్పున గోపాల్‌కి స్ఫురణకి వచ్చింది. ఇంతకిముందే బల్లపక్కగా ఏదో ఆకారం కదిలింది. హా ! ఒక్క ఉదుటున లేచాడు. బలంగా శారదగది తలుపులు తోశాడు. చీకటిలో ఆకారాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. చప్పున లైట్‌వేశాడు. ఆ దృశ్యంచూసి స్తంభీభూతు డయ్యాడు.

[illegible] ప్రకాష్ [illegible] ఆక్రమిస్తున్నాడు. డేగ తన్నుకుపోతున్న గువ్వపిట్టలా ఆమె ఆక్రందనం చేస్తూ శక్తి కొద్దీ పెనుగులాడుతోంది.

టి. టి. ఇ. గోపాల్‌కి శివం పెరిగింది. ఉగ్రనరసింహమూర్తి అయాడు. తటాలున ప్రకాష్‌మీదికి లంఘించాడు. సత్తువ కొద్దీ చాచి లెంపకాయకొట్టాడు. జుట్టుపట్టిలాగి ఒక్క తన్ను తన్నాడు. అంత మనిషీ చాపచుట్టగా నేలకి కరచుకొని, చప్పున లేచి, పిల్లిలా జారుకున్నాడు.

శారద చేతుల్లో ముఖం కప్పుకొని [illegible] స్తోంది. గోపాల్ [illegible] వైపు చూసి, 'స్కౌండ్రల్' అన్నాడు. శారద అతన్ని చూసి తనేం చేస్తున్నదీ తెలియక, చప్పున అతని రెండుచేతులూ పట్టుకొని 'ఇవాళ మీరు లేకపోతే నాగతి ఏమయేదో!' అని గద్గదికంగా అంది.

'రాస్కెల్. ఇన్నాళ్ళా ఈ ఆరడుగుల భారీశరీరాన్ని ఎందుకు పెంచి పోషిస్తున్నానా అని దిగులుపడేవాణ్ణి. దీని అవసరమేమిటో ఇప్పుడు తెలిసింది.' పిడికిలి బిగించి చెయ్యి గాలిలో ఊపుతూ అన్నాడు టి. టి. ఇ. చేతులు విడిపించుకొని.

# వందేమాతరం

కన్యాకుమారి నుంచి కాశ్మీరందాకా 'వందేమాతరం' అనే మాటలు భారతీయుల దేహాలని పులకింప చేస్తాయి. అసలు 'వందేమాతర'మే మన జాతీయ గీతం అయి ఉండాలని ఎందరో భారతీయులు అనుకుంటారు. రాజ్యాంగంలో ఈ పాటకి 'జనగణమన'తో సమానస్థాయి ఉంది.

కాని, ఈ అద్భుత పదజాలాన్ని సృష్టించిన బంకిమచంద్ర ఛటర్జీ గృహం నేడు శిథిలంగా ఉంది. ఇప్పటికయినా శ్రద్ధ తీసుకోనకపోతే శిథిల కుడ్యాలుకూడా మిగలవేమో!

ఇది కలకత్తా వద్ద నయిహాటీ సమీపంలో ఉన్న ఖతల్పారా గ్రామంలో ఉంది. అక్కడి రిక్షావాడికి కూడ దీని చరిత్ర కొంత తెలుసు. బంకిమ చంద్రుడివంశం పెద్ద జమిందారీ వంశం. ఈ భవనం వారి పూర్వీకులు సుమారు రెండువందల ఏళ్లకింద కట్టించారు. నేడు దానిలో ఒక్క రాధాకృష్ణమందిరం (బంకిమ చంద్రుడి తండ్రిగారు కట్టించినది) మాత్రమే మంచి స్థితిలో ఉంది. కొంత భాగం మరమ్మత్తు చేయించుకుని బంకిమ చంద్రుడి వంశంవారు కొందరు నివాసం ఏర్పరచుకున్నారు. అతని శయనాగారంగా ఉండిన గదులు ఇంకా పడిపోలేదు...

1938 లో బంకిమచంద్రుడి శత



బంకిం చంద్రఛటర్జీ.

జయంతి ఉత్సవాలు జరపాలనుకున్నారు. కాని 1954 లో కీ. శే. బిధాన్ చంద్రరాయ్ ఆయన స్మృతిచిహ్నాలని పదిలపరచటానికి కూడా ఎవరూ ప్రయత్నించలేదు. ఛటర్జీల భవనంలో కొన్ని అలమారాలలో బంకిమచంద్రుడు వాడిన టోపీలు, శాలువలూ వగయిరా ఉన్నాయి...

వందేమాతరం చెక్కి ఉన్న రాగిపత్రం ఒక పాలరాయి స్తంభంమీద పొదిగి ఉంది. ఏటా రెండు వేలమందివాకా ఇక్కడికి వచ్చిపోతూ ఉంటారు. పశ్చిమ వంగ రాష్ట్ర ప్రభుత్వంవారు ఈ ఇంటిని తీసుకుని ఒక పురా ప్రదర్శనశాలగా మార్చటానికి నిర్ణయించారుట. ఈ నిర్ణయం త్వరలో అమలు కాగలదని ఆశించాలి.

—హిస్టారికస్ ●



బంకిం చంద్రఛటర్జీ నివసించిన గృహం.

---

# నేల నింగి

శారద అతనివైపు ఆరాధనా పూర్వకంగా చూసింది.

'మీ మేలు ఎన్నటికీ మర్చిపోను.'

'దాందేముందిలెండి. తలుపులు జాగ్రత్తగా వేసుకొని పడుక్కోండి' అన్నాడు గోపాల్.

'మళ్లీ అతనేం దౌర్జన్యం చేస్తాడో?' భయం భయంగా వొణుకుతున్న పెదవులతో అంది శారద.

'ఇంకెక్కడున్నాడు! ఎప్పుడో దౌడు తీసి ఉంటాడు. అయినా మీ తలుపులకి అడ్డంగా బల్ల లాక్కుని పడుకుంటాము. ఎవడొస్తాడో చూస్తా.'

గది బయటికివచ్చి బల్ల తలుపులకి అడ్డంగా లాగాడు గోపాల్. ఆమె గది తలుపులు దగ్గరగావేసింది.

టి. టి. ఇ. గోపాల్ బల్లమీదికి వాలి కాళ్లు చాచుకుని, జబ్బ చరుచుకొని, గర్వంగా గొంతు సవరించుకొని, తలుపులవైపు నిబ్బరంగా చూసి 'నిద్రపోండి, ఎవడన్నా సాహసించివస్తే డొక్క చీరేస్తాను' అన్నాడు. ఆ సమయంలో అతనికి శారద సౌందర్యమూ, కవ్వించే యవ్వనమూ గుర్తుకి రానే లేదు. ●


బడ్జెట్
పంచదార ధర పెరిగిందని భెంగ వద్దు! స్వీటెక్స్ వాడండి!
ఇదివరకు సిగరెట్టు పీకెలు బాగా దొరికేవి! ఇప్పుడు జనాలు.. అవి కూడా మిగల్చటం లేదు!
బడ్జెట్ వచ్చాకా నువేం పెంచావ్?
బడ్జెట్ అరథంగాక- అన్నీ ఓ పైసా పైగా పెంచేశా!
మొన్న నాటకంలో బ్రహ్మాండంగా నటించావ్! ఏదీ.. ఓ సిగరెట్టు ఇలా పారేయ్...
సిగరెట్టు మానేశా బీడీ యివ్వనా?
ఎందుకీ అవసథ? ప్లాట్‌ఫారం టికెట్టు కొనుక్కొని.. రారాదూ?
ఆడబ్బుల్తో ఓ కాఫీ.. ఓ సిగరెట్టు.. ఓ వాక్కపొడి పొట్లం వస్తాయ్...
సుబ్బారావ్

# ఒక వారం విపరీతం — ఫాలాక్షుడు

## కళ్లని కొడుక్కి — దానంచేసిన వృద్ధమాత

తన కళ్ళుతీసి, అంధుడైన తన కొడుక్కి పెట్టవలెనని వో ఉత్తరంలో రాసి రోమ్‌లో 74 ఏళ్ళ సిగ్నోరా మారినెల్లి అనేఆమె మేడమీంచి దూకి ఆత్మహత్య చేసుకుందట. ఆమె కోర్కె ప్రకారం డాక్టర్లు ఆమె కళ్ళుతీసి, కొడుక్కి అతికించారట. తల్లి కళ్లతో లోకాన్ని చూడగలిగిన కొడుక్కి తల్లిని మాత్రం చూసే అదృష్టానికి నోచుకోలేదు.

## భార్యని హత్యచేసి పోలీసుకి లొంగి పోయిన భర్త

జోలారుపేట కుట్టూరు గ్రామంలో 45 సంవత్సరాల పెరుమాళ్ అనే అతనికి, అతని




భార్య గోవిందమ్మకూ నిత్యం అగ్నిహోత్రం (పోట్లాట)రగులుతూ వుండేదట. దీనివల్ల ఆగ్రహావేశాలకు లోనైన గోవిందమ్మ తన కూతురింటికి వెళ్లి పోయిందట. ఇంట్లో తోచని పెరుమాళ్ కూతురింటికివెళ్లి "ఇంటికి వస్తావా లేదా" అని భార్యను నిలదీశాడట. ఆమె రానవేసరికి పోట్లాడి, అప్పటికీ నెగ్గకపోయేసరికి పట్టున కత్తితీసి ఆమెను పొడిచి చంపేసి, నేరుగా పోలీసుస్టేషనుకువెళ్లి విషయం చెప్పి తను లొంగిపోయాడట—పాపాలెంక్క...

* * *

## మూఢనమ్మకం — సజీవదహనం

కుష్టురోగంతో వున్న ఒక మనిషిని గనుక సజీవంగా దహనంచేస్తే యిక ఆ వూళ్లో కుష్టురోగం వుండదన్నా వుండదు అనే వో మూర్ఖపు నమ్మకతో టెహ్రి—గార్వాల్ జిల్లాకు చెందిన బుద్ధ కేదార్ అనే వూళ్లో కుష్టురోగంతో బాధపడుతున్న వో నడివయస్సు స్త్రీని బలవంతాన ఒక గుడిశలో బంధించి ఆ గుడిశకు నిప్పంటించి ఆమెను అగ్నికి ఆహుతి చేశారట ఆ వూరి ప్రజలు. ఈ ఘోరంచూసి భయపడిన వోయిద్దరు కుష్టురోగులు (స్త్రీలు) వూరువదలిపారిపోయి, నవజీవన్ ఆశ్రమానికి చేరి అక్కడ ఈ విషయం చెప్పారట.

* * *

మనిషి రక్తం ఒక అడవి మృగానికి గనుకతాగిస్తే అది గుప్తనిధిని చూపిస్తుందనే మూఢనమ్మకంతో సూరత్‌జిల్లాలోని ఒక వూరులో 14వ తేదీ రాత్రి ఒక ఆదివాస భిల్లుని పట్టుకుని కొందరు చంపారట. ఇది పోయినేడు జరిగినా, దారుణ భయంకర హింసాకాండ గనుకనూ, యింతా చేసిన దుండగులంతా పట్టుబడలేదు గనుకనూ యిటీవల మళ్లీ యీ విషయం ప్రభుత్వంలో త్రవ్వి బయటికి తీశారు. అనుమానితుల పదిమందిలోనూ అరుగురు దొరికారట. మూఢనమ్మకాలతో తోటి మానవుని దారుణంగా చంపడానికి వెనుకాడని మానవుడు విజ్ఞానంతో ఎంతముందుకుపోతేమాత్రం ఏం లాభం! ఇది మానవజాతికే తీరని కళంకం!

* * *

22 ఏళ్ల మహమ్మద్ అనే అతను తన కడుపు నొప్పిని, ఇంట్లో గొడవనూ—యీ రెంటినీ భరించలేక చిత్తూరు నెం. 1 గేటువద్ద శిల్పాపురం, రేణిగుంట రైలుక్రింద పడి, ఆత్మహత్య చేసుకున్నాడట.

* * *

## అప్పు తెచ్చిన ఆపద

పెరియపట్టణం తాలూకా, కరితమ్మనహళ్లి అనే వూళ్లో సేషి అనే అతను థామస్ అనే అతనికి డబ్బు అప్పిచ్చాడట. పుచ్చుకున్న థామస్ తిరిగి ఆ డబ్బు ఎంత కాలానికి చెల్లించకపోయేసరికి, కోపంతో సేషి థామస్‌ని నడిరోడ్డులో పొడిచి, అతనింటికివెళ్ళి, థామస్ నలుగురు పిల్లలనుకూడా పొడిచి, ఆ యింటికి నిప్పంటించి, నేరుగా స్టేషనుకువెళ్ళి తనుచేసిన పనంతా పోలీసులకు తెలియజేశాడట.

* * *

వో భగవంతుడా! పశుపతి! నన్నెలాగైనా నుంచి బెంగాలియిల్లి కాపాడు తండ్రీ అని పశుపతినాథుని ప్రార్థించడానికి 90 ఏళ్ల బెంగాలీ స్త్రీ ఒకామె హిందూదేశంనుంచి ఖాట్మండుకు వెళ్ళిందట. వెళ్ళి ప్రార్థించిందటకూడాను.

* * *

కావేరిపాకంలో 55 ఏళ్ళ మురుగేశ పండితుడు అనే ఆయన రెండోభార్య 30 ఏళ్ళ ఎల్లమ్మ అదే ఊరుకు చెందిన పాండురంగమ్ అనే అతనితో అక్రమ సంబంధం పెట్టుకుందట. ఈ సంగతి తెలిసి మురుగేశ పండితుడు ఆమెకు నయానా, భయానా చెప్పినా ఆమె వినలేదట. ఒకరాత్రి రెండు గంటలవేళ తన యింటి పెరట్లో తన భార్య ఎల్లమ్మా, ఆమె ప్రియుడు పాండురంగమ్, వీలాసాల్లో వుండడంచూసి పటకాకత్తి తీసుకుని, పరుగునవెళ్ళి పాండురంగమ్ పొట్టచీల్చి పారేశాడట. ఆసుపత్రిలో చికిత్సకుముందే పాండురంగమ్ చని పోయాడట.






## జడ్జిగారింట్లో అశరీరవాణి

తన ఇంటిలో రాత్రుళ్లు అశరీరవాణి వినిపిస్తోందని (దెయ్యాలో, దేవతలో) దీనివల్ల తన కుటుంబంలోవివారంతా ఒకే గదిలో చేరి రాత్రుళ్ళు ఆ గదిలోనేపడుకుంటున్నామని పుర్నియా సబార్డినేట్ జడ్జి ఒకాయన విండుకోర్టులో ప్రకటించారట.

* * *

పెరియకుప్పమ్ అనే వూళ్లో 26 ఏళ్ళ పొన్నమ్మాళ్ అనే వివాహిత తన కడుపునొప్పి భరించలేక విషం త్రాగిందట. కానీ ఆ విషం సరిగ్గా పని చెయనందువల్ల అది తాగిన విషయం బయటపడి, ఆయినవాళ్ళామెను ఆసుపత్రిలో చేరుస్తే గండం గడిచాక పోలీసులువచ్చి ఆమెమీద ఆత్మహత్యా ప్రయత్న నేరం మోపారట—టిస్ ధైర్ డ్యూటీ......యూ.....

## ఇంగితం ఉన్న దొంగ

బసిల్‌హర్ (ఒక ప్రదేశం)లో ఓ కోర్టు ఉద్యోగి యింట్లో దొంగలుపడి ధనం, నగా నట్రా బట్టలు, పాతర సామానులు, పనిముట్లు, ఓ అయిదువేల రూపాయలు, తదితర వస్తువులూ, చేతికి అందినవి అన్నీ పట్టుకుపోయారట. ఆ పోయినవాటితోపాటు కొన్ని ముఖ్యమయిన కాగితాలు కూడా పోయాయట. మర్నాడు ఆయన యింటిముందు రుమాలుతో కట్టివున్న ఓ మూట ఉందట. అది విప్పిచూస్తే అందులో పోయిన బాంకు పాసుపుస్తకం, యూనివర్శిటీకి సంబంధించిన కాగితాలు, తదితర ముఖ్యమైన కాగితాలూ ఉన్నాయట. దొంగ ఎవరోగాని [illegible] ఇంగితం పెరిగినాడట. [illegible] సంపాదించుకోవచ్చుగాని, అలాటి పత్రాలు వగైరా సంపాదించడం కష్టమని అతను గ్రహించి, అవి ఆ కోర్టు ఉద్యోగి యింటిముందు పడేశాడట—అహో!

## పెరుగుతున్న జనాభా తరుగున్న భూభాగం

గర్భస్రావాన్ని చట్టబద్ధంచేస్తే స్త్రీత్వం క్షణక్షణాభివృద్ధి గాంచుతున్న యీ జనాభాని ఆపడం, అదుపులో పెట్టడం ఎవరితరమూ కాదని, గర్భ నిరోధక సాధనాలు అనుకున్నంతగా పని చేయటంలేదనీ, వాటిని నమ్మి ప్రయోజనంలేదని, సంతానాన్ని యిచ్చే స్త్రీకి ఆసంతానం నిరోధించుకునే అధికారము కూడా యివ్వాలని గర్భనిరోధం చట్టబద్ధం చేయకపోతే 2100 నాటికి (130 సంవత్సరాలా!) జనం [illegible] డాక్టర్ యస్. కె. అల్లానాడియా అన్నారట— విన్నారా! జనాభా ఎక్కువవుతుంది, యీ భూభాగం చాలదూ అంటున్నారుగానీ, వున్న భూభాగం కూడా రానురానూ ఒరిపిడితో సముద్రంలో కొంచెంకొంచెం కలిసిపోతుంది అని కూడా అవరేం! అంటారంటారు ఆనక.

* * *

తిరుపత్తూరుకు చెందిన వట్టాంపల్లి అనే వూళ్లో పద్మ అనే ఓ అమ్మాయి తలిదండ్రులమీద అలిగి, ఆత్మహత్య చేసుకుందట. ఆమె ప్రవర్తన సరిగా లేకపోవడంవల్ల పెళ్లిగావల్సినపిల్లవు నీ పద్ధతి బావులేదమ్మడూ అని తలిదండ్రులు వారించేసరికి ఆమెకు జీవితంమీద విరక్తిపుట్టి, ఆవేశంవచ్చి వురిపోసుకు ప్రాణం తీసుకుందట పాపం! ●

డాక్టర్ కబుర్లు

## అవిటివాళ్లు బాగా పని చెయ్యగలరు

శారీరికంగా లోపం ఉన్న వారికి ఈ కింది కథ సంతోషకరంగా ఉంటుంది. పరిశ్రమలకి ఇది లాభదాయకంగా ఉండే పాఠం కాగలదు!

1943 యుద్ధ సమయం. అమెరికాలోని ఈస్టర్న్ ఎయిర్ లయిన్స్ వారికి సిబ్బంది కావలసినంతగా దొరకటం లేదు — మియామి అనేచోట మరీను. మియామీకి వెళ్లగలిగిన ఏ అవిటితనంగల వైమానికుడికయినా ఉద్యోగం ఇస్తానని కాప్టెన్ రిక్కెన్‌లూకన్ తన పయి అధికారికి తంతి పంపారు.

25 మంది అవిటివారు మియామీకి వెళ్లారు. కొందరు చేతులుకాళ్లు పోగొట్టుకున్నవారు, మానసికంగా కూడా దెబ్బతిన్నవారు...

వీరందరూ ఏమయ్యారు? ఒక్కడే ఒకడు చనిపోయాడు. మిగతా 24 మందీ ఇంకా అదే కంపెనీలో పని చేస్తున్నారు. కారణం? సరయిన తరిఫీదుతో



ఈ 'అవిటి' వారు 'మామూలు' వారికన్నా దక్కగా, చురుకుగా, శ్రద్ధతో పని చెయ్యగలరని తేలింది!

అంతేకాదు వీరు ఉద్యోగాలు కూడా తిరుచు మార్చరు.

(కాపీరయిటు)

# ప్రశ్నావళి

**....కె. రామలక్ష్మి....**

**బి. హెచ్. ఎల్. ఆర్, భువనేశ్వరం**

నాటకాలలో వేషాలు వేసే స్త్రీలంటే సాటి స్త్రీలకు అంత మంచి అభిప్రాయం లేకపోవడానికి కారణం ?

కారణం ఇద్దరిలోనూ ఉంది. సాటి స్త్రీలు రంగస్థల స్త్రీలని విపరీతంగా యెంచితే రంగస్థల స్త్రీలు సాటి స్త్రీలని సామాన్యులుగా అల్పులుగా చిన్న చూపు చూస్తారు.

**స్త్రీజాతి శత్రువు, చీరాల**

స్త్రీకి ఆదినుండి అన్యాయం జరుగుతుండబట్టే గాని లేకుంటే పురుష వంశాన్ని నాశనంచేసి ఉండేవారు. నిజమేనా ?

మీకు బ్రహ్మరాక్షసాలూ ఎర్రని కళ్ళూ ఉన్నాయా!? భయంతో ఒణికి చస్తుంటే బదులెలా చెప్పను? అయినా పురుషవంశాన్ని నాశనం చేస్తే మాకేం లాభం?.

**కె. ఎన్. కె, బరంపురం**

భర్త ఆర్థిక స్థితిగతులు తెలిసి నేను నాలోని సరదాలని కోరికలని చంపుకున్నానని అతను అర్థంచేసుకోరు. అతని సౌఖ్యంకోసం నేను ఎంత పాటుపడినా జాలిగాని సానుభూతిగాని లేదు...

మీది నెగెటివ్ ఆలోచన. సానుభూతీ జాలీ కదు ఒక యింట్లో స్త్రీకి కవలసినవి. అని మనం మన కష్టాలు ఏకరువు పెడితే ఎవరేనా చూపుతారు! భర్త కష్టం అర్థం చేసుకోవడం, సంసారం చక్కదిద్దుకోవడం సానుభూతికోసం కాదు స్త్రీ చేయడం, తన బాగు కోసం. మీరు అనవసరంగా గోరంతలు కొండంతలు చేసుకుంటున్నారేమో. విశ్రాంతిగా కూర్చుని ఆలోచించండి. మీమేరకి మీరు కోరికల్ని చంపుకొంటే ఒక సంసారాన్నీదడానికి పురుషుడు కూడా కొంత త్యాగం చేస్తున్నాడన్న సత్యం గుర్తించుకు ఆలోచించండి.

**ఎమ్ ఆల్. ఆర్, నాగలాపురం**

భగవంతుడు మనుష్యుల నెందుకు సృష్టించాడు వారు చేసిన తప్పులకు మరలా వారినీ నరకంలోనికెందుకు నెట్టాలి ? అంతమాత్రానికి సృష్టించకుండా ఉంటే మంచిదికదా ?

తిరిగేకాలూ, తిట్టేనోరూ ఊరుకోదంటారు. అలాగే భగవంతుని చిలిపి బుద్ధి. తన సృష్టిచేత ఆటలాడిస్తాడు. రూల్సు అతిక్రమించే అవకాశాలిస్తాడు. తీరా రూల్సు అతిక్రమిస్తే మీరన్నట్టు నరకలోకి నెట్టేస్తాడు! రామ! రామ! ఏ. మాయదారి దేవుడో!

**కె. బి. ఆర్, అనంతపురం**

మీ వోటు ఇండికేట్ కా ? సిండికేటుకా ?

ఎవరికీ కాదు— ఇండికేట్ డ్రామటిక్ ఆర్ట్స్ వారి 'పప్పుకట్టె చూడు!' లో జగజీవన్‌రావ్ వేసిన హాస్య పాత్రకి.

**ఎస్. ఎస్. ఆర్, మునకరెడ్డిపల్లి**

ఏమండీ కె. రా. గారూ ప్రగతిలో మానవునియొక్క కర్తవ్య మేమిటి ? అతడు జనిమించినది కర్తవ్యుడు గానా ? కర్తవ్య బోధకుని గానా ?

ప్రగతిలో తానొక అచ్చు తప్పు కాకుండా చూసుకోవడమే మానవుని కర్తవ్య ! ఇక అతగాడు కర్తవ్య బోధకుణ్ణని గుండె బాదుకున్నా, అతని అసలు బాధ్యత కర్తవ్య నిర్వహణే.

కొందరు మనుష్యులు సినిమావ్యక్తుల శీలాన్ని గురించి పూర్తిగా శంకిస్తారు. అలాంటివారి మాటలను సినిమావారు లెక్కచేయడంలో అర్థంఉందా ?

శీలం అన్నది వ్యక్తిగత విషయం. అది శంకించబడినంతమాత్రాన బేదనుకునే వారుంటే—వారి కర్మ. ఎదుటివారిని నమ్మించడంకోసం మనం నిదర్శనల ప్రదర్శనకి దిగడం హాస్యాస్పదం.

**కె ఎస్. ఆర్, బెక్కెం**

దిగంబర కవులంటే ఎవరండీ? వారి వివరాలు తెలియచేస్తారా ?

నాకూ పూర్తిగా తెలియదు! వారి కవిత్వం చదివాను. వారు చెప్పిన మాటలు విన్నాను. వారిలో ముగ్గురిని చూశాను. కవిత్వం జుగుప్సాకరంగా ఉంది. మాటలు నార్మల్‌గా ఉన్నాయి. వేషాలు బాగున్నాయి.

**బి. కె, హైద్రాబాదు**

కుటుంబ నియంత్రణ అనే పేరుతో పిల్లలు కలుగకుండా చేస్తున్నారే, మరి పిల్లలు కలుగని లక్షాధికారులకు పిల్లలు పుట్టే సాధనము లేమైనా కనిపెట్టారా ?

ఎందుకు కనిపెట్టలేదు. ఎటొచ్చీ భార్యాభర్తలిద్దరూ ఫెర్టిలిటీ టెస్టులు చేయించుకుని డాక్టరు మాట వినాలి. అయినా లక్షాధికారులకే పిల్లలుండరన్నది మీపిచ్చి నమ్మకమా!!

**ఎస్. ఎస్. ఎన్, పిఠాపురం**

మహాకవి శ్రీ శ్రీ పై మీ అభిప్రాయం ?

బాగుంది దేవునిపై మీ అభిప్రాయం? అన్నట్టు! దైవాన్నందరూ తమ తమ సంస్కారాని బట్టి ఎలా ఊహించుకుంటారో శ్రీ శ్రీ భక్తులూ అంతే. ఎటొచ్చీ ఈ దేవుడు అసలు దేవుని లాగా కకుండా ప్రత్యక్ష నిదర్శనలిచ్చి తను ఏ తరవు అన్నది చెప్పేస్తున్నాడు. ఎక్కువ భక్తి లేటుంటే అటేనని నమ్మిన మిగిలినవారిని దగాపడిన తమ్ముళ్ళని చేసేస్తున్నాడు.

**జి. వి. సి హెచ్, పుత్తూరు**

స్వచ్ఛమైన స్త్రీకి మీరిచ్చే నిర్వచనం ఏమిటి ?

చేస్టు విమెన్!

**ఎమ్. ఆర్, కోనరాజుపల్లి**

రామలక్ష్మిగారూ జీవితపథంలో నేను వేసే ప్రతి అడుగులోనూ నీరసం నిరాశలు వెంటాడుతున్నాయి. ముందుకువేయడమా? లేక ?

పూర్తిగా తప్పటడుగులు వేసే పసిపాపలాగ మాట్లాడుతున్నారు! వయోజనులైనవారు నీరసాన్ని నిరాశని 'ఊతకర్రలు' అనుకోరు. ఉత్సాహం, ఉత్తేజం వారికి చేయూత. ప్లీజ్ బక్అప్!! (అంటే నడుం బిగించండి అని నా ఉద్దేశ్యం.)

**పి. వి, నిర్మల్**

గాంధీ శతజయంతి పేరట అనవసర అట్టహాసాలతో ఇంత వ్యయం చేస్తే గాంధీఆత్మ సంతృప్తి పడుతుందా ?

ఆ—భారీఎత్తున ప్రదర్శనలిచ్చే ఇండియన్ స్టేజి ఆర్ట్స్ (!) వారి 'గాంధిజయంతి' తక్కువగా నిర్మించడం అవమానంకదా అంటున్నారు పి.పి. రమణ.

# విడచిన చెర

వజ్రపు కృష్ణారావు



ఆకాశాన చంద్రుడు వెన్నెల విసురుతున్నాడు. మానవ ప్రేరితమైన విద్యుత్‌కాంతి కిరణాలు వెలవెలా పోతున్నాయి. రెండు మూడు రోజుల క్రితం వచ్చిన క్రొత్త సినీమా రెండవ ఆట సమాప్తి పలికింది. కిటకిట లాడుతూ త్రోసుకు పోతున్నారు ఎవరిదారిని వారు. ఏదారీ తెలియక, ఎటు వెళ్ళాలో తెలియక సందేహంతో ఆలోచించడానికి ఫుట్‌పాత్ మీదకు వచ్చి నిలబడిందొక ఇరవై సంవత్సరాల యువతి. ఈ దిక్కులేని పక్షిని ఎత్తుకు పోదామని ఇద్దరు రోడ్ రోమియోలు పసికట్టారీ ఏకాకిని. ఆమె బెదురు చూపులతో మరోదారిని పట్టింది. వాళ్ళు అనుసరిస్తూనే వున్నారు. ఆమె ఎటు నడుస్తూంటే అటు. ఏదో వంక పెట్టి చిన్నచిన్న మాటలు విసురుతూనే వున్నారు. ఆమె పలుకనైనా పలకటం లేదు.

ఆదారినే అలే పోతున్నాడు మౌనంతో మరోవ్యక్తి. ఎవర్నీ చూడటంలేదు, తల వంచుకుని ఆలోచించుకుంటూ, వదే వదే నడిచినదారి, అప్రయత్నంగానే నడిచి పోతున్నాడు. అతనిని అనుసరించిందామె వాళ్ళను చూస్తూ కావాలని. అతని ప్రక్కకు చేరింది. ఆ ఇద్దరు వ్యక్తులూ ఎడంగా కదలి వస్తూనే వున్నారు కొద్దిగా వదలిని ఆశతో.

'టైం ఎంతండీ!' అడిగిందాతనిని.

'ఒంటిగంట' ఆమెను చూస్తూ.

ఆమె వీళ్ళను చూసింది బెదురుగా! వాళ్ళలో కొద్దిగా సడలిన ఆశ మరీ సడలి పోయింది. ఆశను పెంపుచేసుకుంటూ ఆఖరి క్షణంవరకూ చూస్తున్నారు. రెండు మూడు మలుపులు నడిచాడు ఆ మౌనవ్యక్తి. ఆమె కూడా నడిచింది కావాలని. వారూ వస్తున్నారు. ఆ మలుపులను తిరుగుతూ అతను ఇంటికి పోతున్నాడు. అనుమానం లేదు. వాళ్ళు ఈమెకోసం వస్తున్నారు సందేహం లేదు. ఆమెకే ఏదారీ లేదు. ప్రస్తుతానికి అతనే తనదారికి దీపంలా వున్నాడు. ఆ దీపం ఎటుపోతుంటే ఈమె తన దారిని అటు చూసుకుంటూ నడుస్తుంది. ఇలా అతను, ఆ ప్రక్క ఆమె, కొద్దిదూరంలో వాళ్ళు. ఈమెకు గమ్యం చేరాలని కోరికా లేదు. అసలు గమ్యమంటూ లేదు. ఎక్కడికో చేరాలని కోరిక కంటే, వాళ్ళనుండి తప్పించుకోవాలని ప్రయత్నం. వాళ్ళు విడచిపెట్టేలా లేరు. అందుకే అతనిని ఆశ్రయించాలని ఆశ కలిగింది.

'ఏవండీ; మీ యింటికి వస్తానండి!' అసందర్భంగా వినిపించిందాతనికి. ఒకసారి చూసి తనదారిని తాను వెళ్ళిపోతున్నాడు ప్రశ్నార్థకంగా.

'అదిగో అటు చూడండి వాళ్ళు నన్ను వెంటాడుతున్నారు.' వెనుదిరిగి చూసాడు. సమాధానం ఇవ్వలేదు.

'ఏవండీ! రావద్దా!' బ్రతిమిలాడుతూ అడిగింది.

'నేనెలా తెలుసు?' నొసలు విరుచుతూ.

'మీరు తెలియడం కాదు',

'ఈ ఊరేనా?'

'కాదండీ!'

'ఈ అర్ధరాత్రి ఇక్కడేం చేస్తున్నారు?' ఆమె మాట్లాడలేదు 'ఒంటరిగా ఎలా వచ్చారు?' ఆమె మౌనం.

'చెప్పండి ఎందుకు భయం?' అసలు విషయం తెలుసుకోవాలని అడిగాడతడు.

మొదటే తనస్థితిని విడమర్చి వాళ్ళనుండి తప్పించుకోవాలని ప్రయత్నించింది. మదిలో పుట్టిన కోరిక చివరికి పెదవులుదాటి రాలేక పోయింది. తనకు ఈ స్థితిలో సహాయం కావాలంటే మంచి వారితో తన కథను చెప్పక తప్పదు. 'నన్ను ఒకతను ప్రేమించాడు. మా యిద్దరి పెళ్ళికి మావాళ్ళెవరూ అంగీకరించలేదు. పట్నంపోయి పెళ్ళి చేసుకుందమన్నాడు. అందు కోసమే ఈ వూరు తీసుకొచ్చాడు. ఎక్కడెక్కడో త్రిప్పాడు. ఇదే క్రొత్త నాకు. వున్నడబ్బులు అయిపోయాయి. వస్తువులన్నీ తాకట్టు పెట్టాం. తన స్నేహితుని దగ్గరకు వెళ్ళివస్తానని వెళ్ళాడు. నిన్నటినుండీ కనిపించడం లేదు. హోటల్ యజమాని వెళ్ళిపొమ్మనడంతో ఇలా తిరుగుతున్నాను అతనికోసం. నిన్నరాత్రి జరగని సంఘ

# విడచిన చీర

టన జరిగింది. వెనక వస్తున్నవాళ్ళు బలవంతం చేయబోయారు. ఇంతలో నలుగురైదుగురు ప్రయాణీకులు వాళ్ళ బారినుండి రక్షించారు. వాళ్ళతోనే రైల్వే స్టేషను వెళ్ళి రాత్రంతా అక్కడ గడిపాను. ఈ రాత్రిలా వెంట పడుతున్నారు. భయంగా వుంది. ఆ రాక్షసుల్నుండి తప్పించుకోలేనేమో యని ఆశ వదలుకున్నాను. ప్రక్కకు వచ్చినా మౌనంగా మీదారిని మీరు వెళ్ళిపోతున్నారు. అనకూడదుగానీ, మంచివారిలా కనిపించారు. ఈ రాత్రికి...' అంటూ అనుమానించి వెనుతిరిగి చూసింది. వాళ్ళు వస్తూనే వున్నారు. అతను వెనుకకు చూస్తే డొకసారి. ముగ్గురూ మూడు ఆకలిగొన్న పులుల్లా వస్తున్నారు.

'అయితే రాత్రికి నాయింటి దగ్గరుంటారా!'

'ఆఁ వుంటానండి!' ఆశాపూరిత సమాధానం.

అయిదారు నిముషాలు గడిచిన తరువాత రెండు మూడు ఎలక్ట్రిక్ స్తంభాలు దాటిన తరువాత; 'ఇదే నేనుండే నివాసం' అప్రయత్నంగా నించిన తరువాత. ఇద్దరు లోనికి వెళ్ళారు. రోడ్ రోమియోలు నిరాశతో తలల్లాడించి వెనుదిరిగి వెళ్ళి పోయారు. ఆ క్షణంలోనే చంద్రుని మీదుగా నల్లటి మేఘమొకటి

ప్రయనించింది.

ఒకటే గది. నిద్రపోవడానిక్కి ఒక్కటే మంచం. మరో కుర్చీకూడా వుంది. లైట్ వేసాడు.

'ఇదే నేనుండేది! అలా కూర్చోండి!'

లోలోన భయంగావున్నా అనుమానిస్తూ కూర్చుంది. ఆ వెలుతురులో ఆమె ప్రస్ఫుటంగా కకనిపిస్తూంది. ముఖం వాడిపోయింది. తల చెరిగి పోయింది. చీర మాసింది, నిగనిగలాడవలసిన శరీరం మసి పూసినట్టు నల్లగా తయారైంది.

'మీరు అన్నం తిన్నారా!' అన్నాడు రెండు మూడు క్షణాలు చూసిన తరువాత. ఆమె మాట్లాడలేదు. లేదన్నట్టు కనిపించింది.

'అరె! పాపం! ఎప్పటినుండి?'

'దానికేవుంది లెండి.' అనాలని అంది.

'ఎలా?' క్షణం ఆలోచించాడు. 'ఫ్లాస్కులో కాఫీ వుంది, తీసుకోండి!' ఫ్లాస్కుగ్లాసు ఆమెకిచ్చాడు.

ఆమె అనుమానిస్తూనే వుంది తీసుకోవడం గురించి.

'అరె! తీసుకోండి!' కంగారు పెడతా.

సంతృప్తిగా త్రాగేసింది బెదురు గుండెలతో.

'మీకు అభ్యంతరం లేకపోతే స్నానం చేయండి.'

'వద్దు లెండి!'

'రెండు మూడు రోజులనుండి స్నానం లేదేమో! సిగ్గుపడకండి! స్నానానికి నీళ్ళున్నాయి. చన్నీళ్ళే సుమండి. లేచి వెళ్ళండి. అలా బాత్‌రూమ్‌కి!' వుతికిన టవల్, సబ్బు ఇచ్చాడు. ఆమె స్నానానికి వెళ్ళి వచ్చింది పదీ-పదిహేను నిముషాలు తరువాత.

'అరె! మాసినచీర మళ్ళీ కట్టుకున్నారా?' ఆలోచించి 'మరోచీర ఇస్తానుండండి.' అంటూ లేచి వెళ్ళాడు. ఆమె ఆశ్చర్యంతో అలానే తిలకించింది. పెట్టెలో అట్టడుగున వున్న చీరను తీసి ఆమెకందించాడు. చీరను చూసి ఆమెకు భయం వేసింది. భయంతో కూడిన ఆశ్చర్యమూ వేసింది. తీసుకుని బాత్‌రూమ్‌కి వెళ్ళి మార్చుకుని వచ్చింది.




శుభోదయమ్ముతో
విశిష్ట జీవితము
పనిపాటలతో అవశ్య భోగ్యము
రుచిసంపద అపూర్వమది
ఘుమఘుమల గుబాళింపు
A-1 డస్ట్‌ను వాడండి
డబ్బులు ఆదా చేస్తుంది!
Brooke Bond Tea
Brooke Bond
A-1 Dust Tea
బ్రూక్ బాండ్ A-1 డస్ట్
ప్యాకెట్టుకు హెచ్చు కప్పుల మంచి టీ
BB 3379

# విడచిన చీర

'ఇది...!' తెలుసుకోవాలని అడిగింది.

'నా భార్యది !'

'ఆమె...!'

'ఇప్పుడు లేదు.' 'ఆశ్చర్యంతోనూ భయంతోను చూసిం దామె.

'అవును. నిజంగా ఆమె లే...దు!' చివరి అక్షరం గొంతులోనే ఆగిపోయింది: మరోసారి భయ కంపితంగా చూసిందామె.

'నాది అనుకున ది మూడు సంవత్సరాల క్రితం పోయింది. ప్రస్తుతం లేదు. చచ్చిపోయింది. ఇక మిగిలింది ఈ చీర. అప్పుడప్పుడూ ఆ పెట్టె తీస్తూంటె కనిపిస్తూంటుంది. ఒక్కొక్క సారి చూడాలని తీస్తూ వుంటాను. మీరు మాసిన చీరతో వుంటే ఇవ్వాలనిపించింది. టైం చాలా అయ్యింది. నిద్ర పోతారా.!'

'పడుకుంటాను లెండి...!' ఇంకా ఏదో తెలుసుకోవాలని కళ్ళలోని ఆతృతను కనబర్చింది.

కొంతసేపు ఆలోచించిన పిమ్మట 'ఆమె గురించి చెప్పాలని వుంది. అయినా దానివల్ల మీకు ప్రయోజనం శూన్యం. చెప్పకపోవడంవల్ల నాకూ ప్రయోజనం లేదు లెండి. అయినా చెబుతాను. నీకే కాదు, చాలామందితో చెప్పాను. కొందరు వినకపోయినా బలవంతంగా చెప్పాను. కొందరు వింటూ వినకపోయినా చెప్పాను. ప్రస్తుతం మీ కెలావున్నా చెబుతాను.'

ఆమె చలించింది.

'ఆమె నాభార్య కావడానికి ముందు ఏ విధమైన సంబంధమూ లేదు. అమ్మా నాన్న ఆమెను ఎన్నికచేసి నాకు భాగస్వామినిగా చేసారు. దిక్కులేని ఆమెకు రక్షణ కల్పించి నన్ను దిక్కులేకుండా చేసి కన్నుమూసారు. ఎంతో అందంగా వుండేది. నా సర్వస్వం ఆమె! నన్ను ఎంతగానో ప్రేమించేది.' ఒక నిట్టూర్పు విడచి మళ్ళీ ప్రారంభించాడు. 'ఆ ప్రేమను పంచుకోవడానికి బాబు పుట్టాడు అయిదారు నెలలకు ఆమె చనిపోయింది. నా దివ్యజ్యోతి ఆరిపోయింది' బరువుగా వస్తున్నాయి మాటలు. 'బాబును చీకటిలో వదలి వెళ్ళిపోయింది. ఆ పసి బిడ్డను మా మేనత్త తీసుకెళ్ళింది. వాడిలోనే ఆమెను చూసుకుంటున్నాను. ఇదీ నాకథ. ఈ గదిలోనే ఆమె చనిపోయింది. అదిగో ఆ మంచంపైనే' చూపిస్తూ. కించిత్ చలించిం దామె.

'ఆ మంచం మీదనే నేను నిద్రిస్తుంట. అక్కడేనాకు ఉపశాంతి. ఈగదిలో ప్రతీ అణువు ఆమె స్పర్శే. సరిగా మీరు కూర్చుండినచోట ఆమె కూర్చునేది. మీలాగానే కూర్చునేది.'

ఆమె కంపించింది.

'ఆ అదృష్టం లేదు. ఇక రాదు.... వస్తుందంటూరా!' అడిగాడు. అడిగినట్లు తెలియదతనికి.

'రాదండి ఆమె బాబులో ఐక్యం అయ్యింది. ఆమె అందం తన కన్నబిడ్డలో రుచింది. ఆ! మరచాను' తేరుకుంటూ 'కొద్దిగ చెప్పాలని చాలగా చెప్పాను. బహుశా నా ఆవేదనంతా విడమర్చానేమో; ఇక నిద్రపొండి ఆ మంచం మీదే!'

'మీరు...!'

క్రింద పడుకుంటాను.

'నాగురించి మీరు ... నేనే పడుకుంటాను లెండి!'

'ఫర్వాలేదు పడుకోండి. లైట్ తీసేయుమంటూరా!'

'మీ యిష్టం' ఆలోచించిన పిమ్మట.

'నాకు లైట్‌వుంటే నిద్ర పట్టదు. అయినా వుంచుతాను లెండి. మీకు క్రొత్తగా వుంటుంది.'

ఆమె మాట్లాడలేదు అతను పడుకున్నాడు.

గదిలో వెలుతురు. వెలుతురులో ప్రతి అణువూ కనిపిస్తూనే వుంది. మంచంపై ఆమె, క్రింద అతను. నిశ్శబ్దత ఆవరించింది. గత జీవితాన్ని ప్రస్తుత సంఘటనలకి సరిచూసి నెమరువేసి నిద్రపోయాడు. ఆమె గతాన్ని ఆలోచించి వర్తమానంలో వుంది, భవిష్యత్తు కోసం ఎన్నో ఆలోచనలు సముద్ర కెరటాల నిరంతర ప్రయాణంలా వస్తూనే వున్నాయి. అతనియొక్క ఆదరణ ఒక జ్యోతిలా కళ్ళెదుర వెలుగుతూంది. ఆ వెలుగులో ప్రస్తుతపు తననీడ ఎంతవరకూ వుందని

చూసేంది. అది కాస్త చలించి పోయింది.

తన భార్యనుగురించి పడే ఆవేదనా కథ ఆమె చెవిలో మాతన స్పృష్టి కలిగించింది. 'అయినా ఆ అదృష్టం మళ్లీ వస్తుందంటారా ... సరిగ్గా అదే మంచంపై ఆ చోటునే నీలానే కూర్చునేది' ఈ మాటలు సముద్ర కెరటాలఘోషలా వినిపించింది. ఆమె ఆలోచనలో భూమి కంపించినట్లయింది.

ఉదయం ఎనిమిది కావస్తుంది. ఇంకా మత్తువదలని అవస్థలో శరీరాన్ని విరచుకుంటూ లేచి ఆమెను చూసేసరికి లేదు. గది అంతా పరికించి చూసాడు. లేదు. కంగారుగా పెరటివైపుకెళ్లి పరీక్షగా చూసాడు. అక్కడా లేదు. వీధిలో చూడటానికి వస్తున్న తనకి ఆమె పడుకున్న మంచంపై దృష్టిపడింది. కళ్లు పెకలించి చూసినా ఆమెలేదు. చీర చిందరవందరగా పడివుంది. దగ్గరకు వెళ్లి మరీ చూసాడు. రాత్రి తానిచ్చిన చీర తనభార్యది. ఆమె ధరించాడాన్కి ఇచ్చింది. కాని ఆమెలేదు. చీర వంటరిగా వెల వెల పోతుంది. ఆత్రుతగా వీధివైపు కెళ్లాడు. అక్కడా లేదు. కొన్ని నిముషాలు రహదారిని పరికించి నిస్పృహతో వచ్చి మంచంపై కూర్చున్నాడు. నెమ్మదిగా చీరనుతీసి ఏదో తెలియని ఆవేదన తరలి తరలి పొంగిరాగా తనముఖాన్ని ఆ చీరలో దాచుకున్నాడు. ●

# వారఫలం

## 27-3-1970 శుక్రవారం మొదలు

## 2-4-1970 గురువారం వరకు

**మేషం:** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకుంటాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకుంటారు. సాటి వారిలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు-కుటుంబవ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృషభం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను అనుకూలపరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. సాటివారితో మాటపట్టింపులు తగవు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం:** పెద్ద మనుష్యులు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించ గలరు. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఆదాయం బరుంకోసం వ్యయం చేస్తారు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు —ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకుంటారు. ఏ వ్యవహారంలోను ఇతరుల మీద ఆధారపడడం తగదు.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. నూతన విషయాలను తెల్సుకుంటారు.

**కన్య:** వృత్తివ్యాపారాల్లో మీకార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో పెంగుపాటాలు తగవు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు లాభిస్తాయి మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**ధనుస్సు** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం:** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సాటి వారిలో గౌరవం లభిస్తుంది.

**మీనం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. విలువ వస్తువులు కొంటారు.

—మహేష్



# ప్రొద్దుటి తాజాతనము గంటలు తరబడి రోజంతా

ఔను, స్నానం అయిన తరువాత ప్రొద్దుటి
పూటవుండే తాజాతనము రోజంతా
గంటల కొద్దీ వుంచుకోవచ్చు....పాండ్స్
డ్రీమ్ ఫ్లవర్ టాల్క్‌తో. భారతదేశంలో
విస్తారంగా అమ్ముడయే టాల్క్
పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్‌కు నాజూకైన
పరిమళము అల్లా వస్తూనే వుంటుంది....
పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్ తడిని
వెంటనే పీల్చుకుంటుంది,
అతిసన్నిహితంగా చేరాలనిపిస్తుంది....
చల్లగా, తాజాగా, పరిమళిస్తూ
వుంటుంది. ఉక్కతో ఒళ్లంత
అంటుకుంటూండే ఉష్ణ
ప్రదేశాల్లోకూడా. ఇది సంవత్సరం.
పొడుగునా అన్ని కాలాలలోను
వుపయోగించగల టాల్క్!
3 సైజులలో లభిస్తుంది
ఫ్యామిలీ-లార్జి-మీడియమ్




## పాండ్స్
## డ్రీమ్ ఫ్లవర్ టాల్క్

అతి మృదువుగా ఉల్లాసకరమైన టాల్క్
చీస్ బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన భాధ్యతతో యు. యస్. ఎ. లో స్థాపితము.)

P-5482

# మేఘమాల

పి.ఎస్.నారాయణ

## జరిగిన కథ

త్యాగరాజుకు పాటలు రావు. వినడంలోనూ అంత ఆసక్తి లేదు. నారాయణ అతన్ని ఒక కచేరీకి తీసుకు వెళ్లాడు. నారాయణ సంగీతాన్ని ఆస్వాదిస్తుంటే త్యాగరాజుకి విసుగ్గా వుంది. చలపతితో కలిసి బయటికి వెళ్లిపోయాడు. రాణి సుందరమూర్తితో లేచి పోయిందని చలపతి చెప్పినప్పుడు త్యాగరాజు నిర్ఘాంతపోయాడు. అతను హైద్రాబాదు వెళ్లాడు. 'తన పై శకుంతలకున్న అభిప్రాయం తెలిసిపోయాక ఒకవేళ ఆ యింట్లో వుండటం అతనికి మనస్కరించలేదు. ఉద్యోగాన్వేషణలో వూరిమీద వచ్చాడు. అతనికి రాజేశ్వరి కనిపించింది. ఇద్దరూ కలిసి అద్దెకి ఒకే యిల్లు తీసున్నారు. హాస్పిటల్‌లో వున్న స్నేహితుడు చంద్రం గురించే అతనికి ఎక్కువ ఆలోచన పట్టుకున్నది. రోజూ హాస్పిటలుకు వెళ్లి చూసి వస్తున్నాడు. చంద్రం నిరాశావాది భార్య సత్యవతి గురించే అతని బెంగ. త్యాగరాజు అతనికి ధైర్యం చెబుతుంటాడు. సత్యవతి నిర్విరామంగా చంద్రం ఆరోగ్యాన్ని కనిపెట్టుకు వుంటున్నది.

## 10

పదిగంటలప్పుడు, అప్పటికి రాజేశ్వరి ఓ వందసార్లు పోరగా ఇంటినుండి బయటకు వచ్చాడు—శకుంతల దగ్గరకు వెళ్లేటందుకుగాను!

గాంధీ హాస్పిటల్‌కు వచ్చేటప్పటికి పదకొండు గంటలకు పావుగంట తక్కువ అయింది.

శకుంతల బెడ్ దగ్గరకు వెళుతూనే ఉలిక్కిపడ్డాడు త్యాగరాజు.

—అక్కడ రాణి, సుందరమూర్తి, జయరాం అప్పటికే వచ్చివున్నారు!

క్షణం తటపటాయించాడు ముందుకు వెళ్దామా, వెనక్కు వెళ్దామా—అని!

మొట్టమొదట రాణి చూచింది. కలవరపాటునూ, కాంతినీ గూడా కళ్లకు పులుముకొని, భర్త వైపుకు చూస్తూ, 'అన్నయ్యా!' అన్నది పెద్దగానే.

ఒక్కసారి అందరూ త్యాగరాజువైపుకు తిరిగారు.

—వారి చూపులకు తట్టుకోలేనట్లుగా గిలగిల లాడాడు త్యాగరాజు!

'హలో! త్యాగరాజూ!' జయరాం ముందుగా పలకరించాడు.

'హల్లో!' అన్నాడు గొణుగుతున్నట్లుగా—ఏదో కంపరమెత్తుతున్నట్లనిపించగా.

అడుగులు ముందుకూ పడలేదు—వెనక్కూ పడలేదు!

'అదేమిటి! ఆగిపోయారేం?—రండి!' అన్నాడు సుందరమూర్తి.

మరే ఆలోచనా లేకుండా, త్యాగరాజు వెనక్కు తిరగబోతూ, 'కానీయండి... మీరు మాట్లాడుతుండండి...నేను కాసేపుండి వస్తాను!' అన్నాడు.

'మేముండగా మీరు రాగూడదా ఏమిటి?...మేం రహస్యాలేమీ మాట్లాడుకోవటం లేదు!' మనస్సును బాధతో గంటు పెట్టుకున్నా, మొఖంమీద చిరునవ్వును మాయనీయలేదు సుందరమూర్తి.

త్యాగరాజు తడబడుతూ, సుందరమూర్తి నుండి చూపు మరలుస్తూ, జయరాంతో, 'అబ్బెబ్బే...అలాంటిదేమీ లేదు!' అన్నాడు బింకంగా. కాని తరువాత ఏం మాట్లాడాలో తెలియలేదు.

శకుంతలకూ, రాణికీ ఆ వాతావరణం చాలా అసహజంగా వుండి, ఇబ్బంది పడుతున్నారు.

శకుంతల గంభీర వాతావరణాన్ని చల్లబరచటానికా అన్నట్లుగా, 'అక్క రాలేదా?' అన్నది త్యాగరాజు వైపుకు మెడ తిప్పి.

'లేదు!' అన్నాడు ముభావంగా.

'కూర్చోండి!' అన్నది పక్కగా వున్న ఖాళీస్టూలును చూపిస్తూ...'ఫరవాలేదు... ఫరవాలేదు!...' అన్నాడు త్యాగరాజు కూర్చోవటానికి ప్రయత్నించకుండానే.

—అలాంటి సమయంలో అక్కడికి రావటం అతడి మనస్సుకే కష్టంగానే వున్నది!

తన స్వేచ్ఛను ఎవ్వరో లాక్కొని పళ్లతో కొరికేస్తున్నట్లుగా గిలగిలలాడ సాగాడు.

'కాస్త ఆగి వచ్చివుంటే ఎంతో బాగుండేది!' అనుకున్నాడు.

అప్రసన్నంగా వున్నట్లుగా శ్రీ నిట్టూర్పు భారంగా విడిచాడు ఇంతలోనే రాణి అన్నది. 'అయితే శకుంతలా మేము వెళ్లివస్తాం!'

శకుంతలకే బాధగానె వున్నది — ఆ పరిస్థితి.

'సరే!...మళ్లా ఎప్పుడు వస్తావ్?' నవ్వును పెదాలమీదకు లాక్కువస్తూ.

'వీలయినంత తొందరలో!' అన్నది వెనుదిరుగుతూ.

సుందరమూర్తి, జయరాంగూడా బయల్దేరారు.

వాళ్లు వెళ్లిపోవటానికి తన రాకే హేతువయిందేమో అనుకున్నప్పుడు మరిం

తగా బాధపడ్డాడు త్యాగరాజు.

'వస్తాం, త్యాగరాజుగారూ!' అన్నారు జయరాం, సుందరమూర్తి ఇద్దరూ.

ఏదో మనస్సులో గూడుకట్టుకున్నది వెళ్ళగక్కబోతున్నట్టుగా పెదాలు కదిలించ బోయాడు.

—కాని నాలికే ఎదురుతిరిగింది!

వాళ్ళు వెళ్ళిపోయారు.

పోతున్న రాణివంక, సాలోచనగా, పరీక్షగా కొన్ని క్షణాలు అనుకోకుండా చూచాడు—అంతా అప్రయత్నంగా జరిగిపోయింది!

'రండి—కూర్చోండి!' అన్నది శకుంతల.

ఉలిక్కిపడ్డాడు త్యాగరాజు.

ముందుకు తిరిగాడు.

—కాని క్షణం క్రితం చూచిన రాణి రూపం మనస్సునుండి చెరిగిపోవటం లేదు!

కొద్దిగా లావెక్కింది. వత్తైన జడను చుట్టగా చుట్టుకొన్నది.

—మొఖానికి ఏదో పెద్దరికం, నిండుతనం వచ్చినట్టుగా అనిపించింది.

—రాణి చాలా మారింది అనుకున్నాడు!

'అదేమిటి?... కూర్చోండి!' అన్నది శకుంతల రెట్టిస్తున్నట్టుగా—ఇంకా ఆలోచిస్తున్నట్టుగానే వున్న త్యాగరాజును పరిశీలనగా చూస్తూ!

తేరుకొని. కూర్చొని, 'ఎలా వున్నది' అన్నాడు.

'ఇప్పుడిప్పుడే నరకం ప్రారంభమవుతోంది!' అన్నది దీనంగా నవ్వుతూ.

జాలిగా చూచాడు ఆమె మొఖంలోకి త్యాగరాజు.

ఒక్క రోజులోనే మొఖమంతా పీక్కుపోయింది. గడ్డం క్రింద, చెంపమీదగా వున్న నీలిమచ్చలు ఆమెలోని అందాన్ని హరిస్తున్నాయి.

—అవే ఆమెలోని అహాన్నిగూడా హరిస్తున్నయ్యేమో అనుకున్నప్పుడు మనిషి విచలితుడయ్యాడు.

బేలగా వున్న ఆమె చూపులు అతడిలోని జాలికి పురులెక్కిస్తున్నాయి.

'నొప్పిగా వున్నదా?'

'రాత్రి నిద్రలేదు!'

'ఆహారం ఏం తీసుకున్నావ్?'



'నాకే ఆరక్షణ...ఏ వివో చెప్పారు... అమలుపరచలేక చస్తున్నాను!' అన్నది.

'మరి కష్టాలు వచ్చినప్పుడే గదా మనం భరించవల్సింది!'

'నా కనిపిస్తుంటుంది ఒక్కక్షణంలో —ఈలాంటి కష్టాలు ఎదుర్కొనేదాని కంటే చావటమే సంతోషంగా వుంటుం దని!'

తలవంచుకు కూర్చున్న త్యాగరాజు అధాట్టుగా తలెత్తి ఆమె మొఖంలోకి చూచాడు భయంగా.

'నిజం కాదంటారా?' అన్నది నవ్వి రెట్టిస్తున్నట్లుగా.

'పిరికివాళ్ల భావన అది!'

'నేను ధైర్యస్తురాలినని ఎవరు చెప్పారు?' ఆ కంఠంలో ఓక్షణం గర్వపు జీర తొంగి చూచినట్లని పించింది.

'కాని పిరికిదానివి అనుకోలేదు!' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

'పోనీయండి... ఆచర్చ దేనికి...నేనేం ఆత్మహత్య చేసుకోబోవటం లేదుగా!' అన్నది నవ్వుతూ తల తిప్పుకుంటూ.

త్యాగరాజుకు మాటలు దొరక్క కూర్చుండిపోయాడు.

'మీ మిత్రుల కెలావున్నది?'

'మామూలుగనే!'

'ఇంకా ఆసుపత్రిలో ఎన్నాళ్లు ఉండా లిట?—నాకుమాత్రం ఆసుపత్రి అంటే రెండు రోజులలోనే పరమ అసహ్య మేసింది!'

'కాని, తప్పదుగదా?' అన్నాడు మొదటి ప్రశ్నకు తప్పిస్తూ, రెండో ప్రశ్నకు సమాధానం అన్నట్లుగా.

దీనంగా త్యాగరాజు మొఖంలోకి చూచింది.

'—నిజంగా, నేను అదృష్టవంతు రాలిని!... అహంతో మిడిసిపడ్డ నన్ను, మీరు ఇంత త్వరలో క్షమిస్తారనుకో లేదు!'

'నేను క్షమించకుండా వుండేందుకు నీవు నాకుచేసిన హాని ఏంవున్నది?'

'అవమానించటమూ, ద్వేషించటమూ హానిగదా?'

'నేను నీ మాటల్ని ఎక్కువసార్లు సీరియస్‌గా తీసుకోలేదు-కుండ బద్దలు కొట్టేలా అన్నమాటలకు ఆ క్షణంలోనే బాధపడేవాడిని, మనస్సు పాడుజేసుకుండే వాడిని!'

'అయితే నిజంగా ధన్యురాలినే నేను!' అన్నది శకుంతల — ఆనందంతో మొఖాన్ని నిండుగా చేసుకొని.

కొద్దిక్షణాల మౌనం తరువాత 'నేను ఒక ప్రశ్న అడుగుతాను మీకు కోపం రాకుండా వుంటుందా?' అన్నది—అతడి మొహంలోకి—ఏదో దివ్యమూర్తి మొఖం లోకి తాదాప్యంజెంది చూస్తున్నట్లుగా చూస్తూ.

'అడుగు!'

'మీరు నాకు మాటయివ్వాండి!'

'ఏంవని?'

'—కోపం తెచ్చుకోనని!'

'ఇచ్చినా తెచ్చుకోకుండా వుండాలనేం వున్నది?—నా హృదయం అంత ధృఢ మైనదేం గాదే!'

'నాకు నమ్మకమున్నది— మి మాటల మీద మీరు నిలబడగలరని!'

'ముందుగానే సంకెళ్లతో బంధించా లను కుంటున్నావా?'

'మీరేమైనా అనుకోండి దాన్ని!'

ఒక్కక్షణం మౌనంగా కాలాన్ని మింగేసి, 'సరే! అడుగు ...నా కిష్టం లేనిదీ, నాకు కష్టం కలిగించేదీ అయితే —ఇంకెపుడూ ఆ విషయంమీద మాట్లాడ వద్దంటాను—దానికి నీ వంగీకరించాలి — మాటమీద నిలబడాలిగూడా!' అన్నాడు ఒత్తి పలుకుతూ — ఏదో ఒప్పందానికి వస్తున్నట్లుగా.

'తప్పకుండానూ!' అన్నది కళ్లు కాంతివంతం చేసుకొని.

తృప్తిగా నవ్వాడు త్యాగరాజు.

'అడుగుతున్నాను!'

'ఇంకా ఆలస్యందేనికి' ఏమడుగుతుందా అనే ఉత్సుకతతో ముందుకు వంగాడు.

ఒక్కక్షణం మనస్సులో చెప్పదల్చుకున్న దేదో మనం చేసుకుంటున్నట్లుగా ఆగి, 'నేను పరాయిదాన్ని...అంతేకాదు కొన్నినెంల క్రితంవరకూ నన్ను మీరు చూడలేదు... మీకు పరిచయంలేదు...అయినా నేను చేసిన తప్పుల్ని మీరు చాలాత్వరలో క్షమించ గలి గారు...కానీ రాణి మీ చెల్లెలు ... మీ చేతులోత్తే పెంచారు... మీ మరోప్రాణంలా చూచుకున్నారు...అప్పటికీ ఆమె తప్పుల్ని మీరు క్షమించలేదు ... క్షమించ లేక పోతున్నారు...కారణం తెలుసుకోవచ్చా!' అన్నది.

ఆలా అడిగిన తరువాత ఒక్కసారి — ఆలా అడగటంలో త్వరపడ్డానేమో అని గూడా అనుకోబోలేదు.

త్యాగరాజు ఊహించిన ప్రశ్న గాక పోయినా విషయం అదే!

అందుకే అతడు ఆమె మాటలకు ఏలాంటి ఆవేశమూ తెచ్చుకోలేదు.

ఖాలా తాపీగా, 'అందుకే!' అన్నాడు ఏదో భావగర్భితంగా.



'అంటే?' నుదురు చిట్లించింది అర్థం కానట్టుగా శకుంతల.

'ఆమె నా మరో ప్రాణమవ్వటం వలననే!' అన్నాడు నవ్వి—గుండెల లోతుల నుండి!

'నా బుర్ర అంత పదునైనదిగాదు—తేటతెల్లంగా చెప్పండి!' అన్నది సిగ్గు పడుతున్నట్టుగా నవ్వి.

'నా మరో ప్రాణంగానే ప్రేమించాను...కానీ, ఆమే నన్ను ప్రేమించలేక పోయింది ... నన్ను మోసం చేసింది ... నా గుండెల్ని నలిపివేసింది... అసలు నన్ను నమ్మనేలేకపోయింది!' ఎంత ఆపుకుందా మనుకున్నా ఆవేశాన్ని ఆపుకోలేకపోయాడు.

ఇక ఆ విషయంమీద మాట్లాడటం ఇష్టం లేనట్టుగా లేచి నిలబడి, 'నేను వెళతాను!' అన్నాడు.

శకుంతల భయంగా, 'కోపంతోటా!' అన్నది.

'నేనంత మూర్ఖుణ్ణిగాదు!'

బయటకొచ్చేశాడు.

—సరిగ్గా అప్పుడు మధ్యాహ్నం పన్నెండు గంటలయింది.

హాస్పిటల్‌నుండి స్టేషన్‌కు నడుస్తుంటే దారిలో స్వామి కనబడ్డాడు.

'నిన్న చెప్పిన పుస్తకాలు కొన్నావా?'

'ఇంకా లేదు, సార్!'

'ఏం...ఆలస్యం దేనికి ... మళ్ళా పరీక్షలు దగ్గరకు వస్తున్నయ్యేవో?'

'కొంటాను సార్...రెండురోజుల్లో...' సిగ్గుపడుతున్నట్టు తలవంచుకున్నాడు.

త్యాగరాజా సంశయిస్తూనే, 'డబ్బులు లేవా?' అడిగాడు.

స్వామి మాట్లాడలేదు. తల మరింతగా కృంగిపోయింది.

'ఇక్కడకు దగ్గరిలో ఏదైనా పుస్తకాల షాపు వున్నదా?'

'ఎందుకుసార్...రేపో, ఎల్లుండో నేను కొంటాను!' అన్నాడు త్వరత్వరగా.

'ఫరవాలేదు లెహోయ్ ... పద... షాపు ఎక్కడ వున్నదో చూపించు!'

'మీరు...కొనవద్దు సార్!'

'ఊఁ ... నేను చెప్పిందానికి అడ్డు చెప్పబోకు ... పద!' అన్నాడు గంభీరంగా ముందుకు అడుగులు వేస్తూ.

స్వామి మాట్లాడలేకపోయాడు.

# మేఘసూల

'మోండా ఎదురుగ్గా వున్నాయి షాపులు!' చాలా చిన్నగా అన్నాడు.

త్యాగరాజు వెనుదిరిగాడు.

స్వామి అనుసరించాడు.

కావాల్సిన పుస్తకాలు షాపులో కొన్నారు.

వచ్చి ఒకటో నెంబరు బస్సు ఎక్కారు.

బస్సు ఎక్కుతుంటే స్వామి అడిగాడు. 'ఇంటికి కాదా, సార్!' అని.

'చిక్కడపల్లిలో వో చిన్నపని వున్నది— అది పూర్తిచేసుకొని వెళ్దాం!'

స్వామి తిరిగి మాట్లాడలేదు.

ఎక్కడో పక్క సీట్లో దూరంగా కూర్చోబోతుంటే పిలిచి పక్కనే కూర్చో బెట్టుకున్నాడు త్యాగరాజు.

ఉదయాన రాజేశ్వరికి చెల్లెలు వ్రాసిన ఉత్తరం చదివినప్పటినుండి— ఇక తమ వివాహ విషయంలో ఏలాంటి తాత్సారమూ చేయగూడదు అనుకున్నాడు.

'ఆమె మనస్సును ఏమాత్రమూ కష్టపెట్టగూడదు!'

అందుకే చిక్కడపల్లి ప్రయాణం గూడా!

వెంకటేశ్వరస్వామి దేవాలయానికి వెళ్ళి — రేపుదయానే వివాహం జరిగేటందుకుగాను కావాల్సిన ఏర్పాట్లు చేయాలి!

ఇద్దరు చిక్కడపల్లిలో బస్సు దిగారు.

వెంకటేశ్వరుని గుడికి నడిచారు.

స్వామిని వాకిట్లోనే వుండమని త్యాగరాజు లోపలికివెళ్ళి ఓ పది నిముషాల్లో బయటకు వచ్చాడు.

దేవాలయంనుండి బయటకు వస్తున్న అతడిలో తృప్తి చిరునవ్వు రూపంలో వెలుగుతుంది.

మనిషి నిండుగా వున్నట్లనిపించింది.

ఉత్సాహంగా అడుగులు వేయసాగాడు.

'రాజేశ్వరి తను చేసిన' పనికి ఎంతగానో సంతోషిస్తుంది?'

నాంపల్లి వెళ్ళే బస్సుకోసరం ఎంతసేపు నిల్చున్నా బస్సు రాలేదు.

పైన ఎండ మాడిపోతుంది.

చమటలు పడుతుంటే చికాగ్గా వున్నది త్యాగరాజుకు.

అంతేగాకుండా తను తీసుకున్న నిర్ణయాన్ని, చేసిన ఏర్పాట్లను గురించి ఎంత త్వరగా రాజేశ్వరికి చెపుదామా అనే ఆత్రంలో వున్నాడు—

ఆమెలోని ఆనందాన్ని చూచి ఆనందించాలి!

వెళ్ళాలి...వెంటనే వెళ్ళి ఆమెముందు వాలాలి...

అతడిని తెలియని ఉద్వేగం ఆవరించింది.

—ఆలస్యాన్ని భరించలేక పోతున్నాడు.

రాని బస్సుమీద విసుక్కున్నాడు.

చికాకు కలిగిస్తున్న చమటమీద విసుక్కున్నాడు.

తనకు అవసరంలేని వస్తున్న బస్సుల మీద విసుక్కున్నాడు.

చివరకు చిరాగ్గా—అటు వెళుతున్న ఖాళీ రిక్షాను పిలిచి ఎక్కి కూర్చున్నాడు.

స్వామి, 'నేను వెళ్ళి మధ్యాహ్నం వస్తాను సార్!' అన్నాడు నమస్కరిస్తూ.

'పని వున్నదా?'

'అవునండీ!'

'మంచిది...అలాగే!'

రిక్షా పల్లంలోకి జారిపోయింది.

త్యాగరాజుకు అలా పోతుంటే చాలా హాయిగా వున్నది.

సర్వం మరచిపోయాడు. బాధను మర్చిపోయాడు. వేదనను మర్చిపోయాడు. దిగులు మర్చిపోయాడు. చంద్రాన్ని మర్చిపోయాడు. శకుంతలను మర్చిపోయాడు. సత్యవతిని మర్చిపోయాడు. రాణిని మర్చిపోయాడు.

అతడికి కళ్ళముందు రాజేశ్వరే మెదులుతున్నది.

ఆమె ఆనందమే మెదులుతున్నది.

—అదే అతడికి తృప్తి!

'తను రేపు వివాహితుడవుతున్నాడు!' అనుకున్నప్పుడు పెదిమలమీద చిరునవ్వు దానంతటదే అలుముకు పోయింది.

అతడు సంతోషంలో తేలిపోసాగాడు.

ఇంటికి వచ్చేటప్పటికి ఓ పది నిముషాలు పట్టింది.

చాలా ఆలస్యమయి పోతున్నదేమో నన్నట్లుగా క్షణ క్షణానికి ముందుకు వంగి ఎంతదూరం వచ్చాగా అని చూచుకో

పొగాడు.

దూరంనుండి తన ఇంటిని చూస్తూనే గుండెలమీద బరువు తీరినట్లుగా ఫీలయ్యాడు.

వాకిటి దగ్గరి నిలబడి రోడ్డుమీదకు చూస్తున్న రాజేశ్వరిని చూస్తూనే దూకుతున్నట్లుగా రిక్షా దిగాడు.

త్వర త్వరగా లోపలికిపోయి రాజేశ్వరికి చెప్పాలి — తమని ఇంకెవ్వరూ వేలెట్టి చూపలేరని!

రిక్షా డబ్బులిచ్చేసి మెట్లెక్కుతున్న త్యాగరాజా వంక ఆత్రంగా చూస్తూన్న రాజేశ్వరి తలుపు దగ్గరకు లాగుతూ, 'హాస్పిటల్‌దగ్గరకు వెళదాం పదండి!' అన్నది.

'దేనికి!' ఏదో భయం నీడలా ఆవరిస్తుండగా అడిగాడు.

'చంద్రం పోయారట!'

'రాజేశ్వరీ!' పెద్దగా అరిచాడు త్యాగరాజా.

* * *

ఓ నల్లటి భయంకరమైన మేఘం ఆవరించి ఆ యింటిలోపల మనుష్యుల మనస్సులమీద అశాంతి తెరను కప్పివేసింది.

అది రాత్రి. సమయం పది గంటలు,

అస్తవ్యస్తమైన మనస్సుతో అంతకు కొద్ది నిముషాల క్రితమే త్యాగరాజా ంగిలి పడ్డాడు.

ఎ రాజేశ్వరి కంచాల్లో అన్నం పెట్టి ఓమూలగా చాపమీద పడుకొనివున్న సత్యవతిని భోజనానికి లేపేటందుకుగాను ప్రయత్నిస్తున్నది.

'ఈనాటికి నీవు భోజనం చేసి మూడు రోజులు...అంతేగాదు, తలకు నూనె రాసుకొని స్నానంచేసి గూడా మూడురోజులే... జుట్టుచూడు ఎంత అసహ్యంగా ఐయూ ాయి జడలు గడుతోందో...మొఖం పీక్కుపోయి కళ్ళు కనబడకుండాపోతున్నయి... నీవు ఇలా అయిపోవటం వలన ఏం సాధించగలుగుతావ్?' అన్నది రాజేశ్వరి ఆమె పక్కనే మోకాళ్ళమీద కూర్చొని ఆమె వెన్నుమీద అనునయంగా వేయివేసి రాస్తూ.

'నీవు చెప్పినవన్నీ చేసిగూడా సాధించే దేవిటి?' అడిగింది వస్తున్న వెక్కును ఆపుకుంటూ.

'నీవు బ్రతకడం నికిష్టం లేదా?'

'నేను బ్రతికి చేసేదేవున్నది—ఎవరి కోసరం బ్రతకాలి?'

రాజేశ్వరి కళ్ళల్లో నీళ్ళు తిప్పితినాయి.

'సత్యవతీ!' విచలిత అవుతూ, కాస్త గంభీర వాతావరణాన్ని తేలికపరుస్తున్న

ట్లుగా హేళనవ్వు నవ్వి 'భారత దేశపు జనాభా ఎంతో నీకు తెలుసా?' అడిగింది.

త్యాగరాజు కిటికీలోనుండి బయటకు చూస్తూ మనస్సును వాళ్ల సంభాషణ మీద లగ్నం చేశాడు.

సత్యవతి తల అడ్డంగా వూపింది.

'ఇప్పటికే వున్న కొన్ని కోట్ల జనాభా రోజురోజుకూ లెక్కకుమించి పెరిగి పోతోంది...చచ్చిన ప్రతి ఒక్కరితోబాటు మరొకరు చచ్చిపోవాలనుకుంటే జనాభా పెరుగుదల సమస్య ప్రభుత్వానికి వుండేదే గాదు— కాని, ఎందుకలా జరగటం లేదంటావ్? —ప్రభుత్వానికిగాని, ప్రజలకుగాని ఆ విషయం తెలియకనా?' వ్యంగ్యంగా నవ్వింది రాజేశ్వరి.

సత్యవతి తీక్షణంగా రాజేశ్వరి మొఖం లోకి చూచింది.

'లే, లే! నామీద కోపముంటే నన్ను నాలుగు చివాట్లు పెట్టు...కాని భోజనం చేయకుండా మాత్రం పడుకోబోకు — నామీద ఒట్టే!'

రాజేశ్వరి మాటలనయితే భరించ లేనట్లుగా కాస్త ఎంగిలయితే పడింది గాని, ఆకలిని ఏమాత్రం చంపుకోవటానికి ప్రయత్నించలేదు.

దూరంగా ఉన్న పాన్‌షాపు చుట్టూ జనం ఈగల్లా ముసురుతున్నారు.

ఉదయం శకుంతల వద్దనుండి వస్తుండగా కనబడిన దృశ్యం—ఈగల్లా మూగుతున్న ఆ జనాన్ని చూస్తుంటే— గుర్తుకొచ్చింది త్యాగరాజుకి!

...తను తల వంచుకు నడుస్తున్నాడు.

చంద్రం చనిపోయిన తరువాత తను రోడ్డుమీదకు వచ్చింది ఆరోజే.

అదీ ఆసుపత్రిలోవున్న శకుంతలను చూడటానికిగాను వచ్చాడు...

తను స్టేషన్‌కు వెళ్లే దారిలో రోజూ ఆ యింటిని ఒక్కసారి తలెత్తి చూస్తూండేవాడు.

—అంటే ఆ యింటిమీద అవ్యాజమయిన ప్రేమతోనూగాదు, అపేక్షతోనూ గాదు!

అక్కడకు వచ్చేటప్పటికి కళ్లు అనుకోకుండా అటువైపుకు తిరిగేవి.

సరిగ్గా ఆ సమయంలోనే కొన్ని జతల యువతుల కళ్ళు తన కళ్లల్లోకి చూచేవి...

# మేఘవరాల

అసహ్యంగా తల త్రిప్పుకుంటుండేవాడు, రోజూ ఆ యింటివంక ఎంత చూడ గూడదనుకుంటున్నా కళ్లను అదుపు లోకి తీసుకోలేకపోతూ వుండేవాడు!

—ఇక ఆ యింటిముందు ఎప్పుడూ నిలబడివుండే కార్లన్నా, స్కూటర్లన్నా, రిక్షాలన్నా అసహ్యమే!

స్త్రీలు సిగ్గులేకుండా సంచరించే గృహం అది!

నరకానికి మారుపేరు ఆ గృహం!

అయితే నేం—

డబ్బున్న విలాస పురుషులకు స్వర్గ ధామం అది!

సరిగ్గా ఆ యింటిని దాటుతున్న సమయంలో తన యింటి యజమాని ఆ గృహం నుండి త్వరత్వరగా బయటకు వస్తూ కనబడ్డాడు.

తను ఉలిక్కిపడ్డాడు!

తనలో ఆయనమీద ఏర్పరుచుకున్న గౌరవమూ, ఉన్నత భావాలూ జాతి ఒక్కసారిగా పటాపంచలయినాయి.

నిజం!

అసహ్యమేసింది—

అతడు అంత మూర్ఖుడా?

తను ఇన్నాళ్లూ ఆవిడను ఓ శిఖండిగానూ, పరమ రాక్షసిగానూ ఊహించుకుంటున్నాడు.

తన ఊహాలు తల్లక్రిందులయినందుకుగాను విభ్రాంతి జెందాడు.

—ఆమె ఆలా ప్రవర్తించటంలో అనుచితం లేదేమో ననిపించింది...

అడుగులు ముందుకు పడుతున్నయి సర్వం మరచి.

'పోనీయ్...ఎవరెలా పోతే నాకేం,' మనస్సులోనే అనుకున్నాడు.

'క్షమించాలి!... నేనంటే మీకు చాలా అసహ్యమేస్తున్నది గదూ?' అన్నాడు ఆయన—తన యింటి యజమాని—పేలవపు నవ్వుతో.

కలవరపడ్డాడు తను.

'నాకు తెలుసు... మీరేగాదు ... నన్ను చూచిన ఎవరైనా ఆలాగే భావిస్తారు... కాని ఒక్కమాట చెబుతాను వినండి— నాకు వివాహమయి యిరవై సంవత్సరాలయింది...పదేళ్లనిమిది సంవత్సరాలు ఆమె మాటలు వింటున్న లోకుల దృష్టిలో వ్యభిచారినే అయినా, త్రాగుబోతునే అయినా, నేను మాత్రం ఎంతో పవిత్రంగానే జీవితాన్ని గడిపాను ... కాని రెండు సంవత్సరాలబట్టే ఈ ఊబిలో ఇరుక్కుపోయింది నేను— అదీ దేని కనుకుంటున్నారు, దాని మాటలు భరించలేక — అన్నిమాటలు పడుతూ, అనుభవించటం చేతగాని చవటను కాలేక!...' ఆవేశంగా చెప్పుకుపోతున్నాడు.

'నాకెందుకు చెబుతారు అవన్నీ!' వడివడిగా ఆయన్ను తప్పించుకుంటున్నట్లుగా ముందుకు అడుగులు వేశాడు తను.

త్యాగరాజు ఆ కిటికీలోంచి చూస్తూ తనలో తాను నవ్వుకున్నాడు.

ఎవరు దోషులు?

ఎవరు నిర్దోషులు?

ఎవర్ని తప్పనాలి?

ఎవరిది ఒప్పనాలి?

—వెనుదిరిగి వచ్చి చాపమీద కూర్చుంటున్న సమయంలో నాలుగు మెతుకులు ఎంగిలిపడ్డ సత్యవతి చేయి కడుక్కువచ్చి మూలగా అప్పటివరకూ పడుకున్న చాప మీద, మెడవరకూ దుప్పటి కప్పుకొని ముడుచుకు పడుకున్నది.

సత్యవతిని ఎలా మార్చాలి—?

ఆమెను ఎలా మనిషిగా తయారు చేయాలి?

మనస్సంతా కలతబారింది.

'భగవంతుడా! నా చంద్రాన్ని తీసుకువెళ్లి నీవు పొందిన లాభం ఏమిటి? — ఎవరూలేని నన్ను ఎందుకు తీసుకువెళ్ల లేక పోయావ్?'

'ఏం చేస్తున్నారు చీకట్లో?' రాజేశ్వరి గొంతుకు ఉలిక్కిపడ్డాడు త్యాగరాజు.

'లైటు కావాలనే ఆర్పారా?'

'దేనికి లైటు?' అన్నాడు తడారని కళ్లతో.

'సరే! నా ఖర్మ!...నేనేం చేస్తాను?' గిరుక్కున వెనక్కు తిరిగి వంట యింట్లోకి వెళ్లిపోయింది — అక్కడ వదిలి వచ్చిన గిన్నెలను సర్దేటందుకు.

'—దిగుళ్ల అగాధంలో కావాలని కూరుకుపోతున్న వాళ్లను ఎవరుమాత్రం రక్షించగలరు!' విసుక్కున్నది రాజేశ్వరి.

(ఇంకా ఉంది)

ధర్మపథం

# భరతుని సౌశీల్యం




■ శ్రీరామునికీ లక్ష్మణుడికీ శరీరాలు వేరయినా ప్రాణం ఒక్కటే అన్నమాదిరిగా అన్యోన్యంగా-అవినాభావంగా వుండేవారని మనకు తెలుసును. అన్నదమ్ములు నలుగురు వుండగా వీరిద్దరికీ యిలా జోడుకుదరడం ఎలా సంభవించిందో తెలుసుకోవలసిందే!

యజ్ఞపురుషుడిచ్చిన పాయసాన్ని దశరథుడు పంచిన విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. ఆయన ఆ పాయసంలో పట్టమహిషి కౌసల్యకు సగమూ, అత్యంత ప్రియురాలైన కైకకు సగమూ, ఇచ్చాడనీ, వారిద్దరూ తమ తమ భాగాల్లో కొంత కొంత సుమిత్రకిచ్చారనీ-చెప్పడం ఉన్నది. కౌసల్య యిచ్చిన భాగంవల్ల కలిగిన లక్ష్మణుడు రామునికీ, కైకయిచ్చిన పాయసంవల్ల కలిగిన శత్రుఘ్నుడు భరతుడికీ సహచరులయినారట! అంచేత లక్ష్మణుడు రామునియెడల భక్తిగౌరవాలను చూపడం సహజమే!

భరతుడు రామునిపట్ల చూపిన భక్తిగౌరవాలు అపారమైనవి. అవి అతని సౌశీల్యానికి మచ్చుతునకలు!

దశరథుడు శ్రీరామునికి పట్టాభిషేకం చేయనున్నప్పుడు భరతుడు అయోధ్యలో లేడు. అతడు వుంటే శ్రీరాముని వనవాసం సంభవించే ఉండదు. భరతుడు వచ్చాక తాను అక్కడ లేనప్పుడు జరిగిన సంఘటనలను తెలుసుకుని తల్లిమీద మండిపడ్డాడు గాని, తనకు రాజ్యం లభించినదని సంతోషించ లేదు. శ్రీరాముణ్ణి తీసుకొనివచ్చి సింహాసనంపైని కూర్చోపెట్టి తానాతని సేవ చెయ్యడానికే సంకల్పించాడు.

భరతుడు ససైన్యంగా రావడం చూచి గుహుడూ, లక్ష్మణుడూ కూడా పొరపాటుగా అభిప్రాయ పడ్డారు. యదార్థం తెలిశాక చాలా సిగ్గుపడ్డారు!

వనవాసం మానివేసి, తిరిగి అయోధ్యకు వచ్చి ప్రజలను పాలించాలని భరతుడు అన్నగారిని ఎన్నో విధాల ప్రార్థించాడు. అయినా పితృవాక్యాన్ని పాలించ దలచిన రాముడు భరతుడి కోరికను చెల్లించ లేదు తనకు దత్తమయిన రాజ్యాన్ని తాను సమర్పిస్తున్నానని చెప్పినా-రాముడు సమ్మతించ లేదు. అన్న, రాజ్యాన్ని స్వీకరించకపోతే తన కున్నా అది అక్కరలేదనీ, తాను కూడా జటావల్కలాలు ధరించి శ్రీరాముని సన్నిధినే ఉండి పోతానని భరతుడు గట్టిగా చెప్పాడు. అలా జరిగితే రాజ్యం అరాజకంకాక మరేమవుతుంది? అందువల్లనే వసిష్ఠాదులు ఆలోచించి ఒక సంధి కుదిర్చారు. శ్రీరామునివల్ల భరతుడు అతని పాదుకలను తీసుకుని వాటికే పట్టాభిషేకం చేసి, వాటి ప్రతినిధిగా తాను రాజ్యాన్ని-అన్న వనవాసం పూర్తిచేసి తిరిగి వచ్చే వరకూ-పద్నాలుగేళ్లు-పాలించడానికి సమ్మతించాడు.

అయితే- రాముడులేని అయోధ్యను ప్రవేశించ లేదు. పక్కనున్న నందిగ్రామంలోనే ఉండి పరిపాలన కొనసాగించాడు, ఎప్పుడు పద్నాలుగేళ్లూ నిండుతాయా? అని దినం ఒక యుగంగా లెక్క పెట్టుకుంటూ.

రావణ వధానంతరం సీతా లక్ష్మణ సమేతుడై శ్రీరాముడు పుష్పక విమానం ఎక్కి అయోధ్యకు వస్తూ ముందుగా హనుమంతుణ్ణి పంపాడు, భరతుడి అభిప్రాయం ఎలా ఉన్నదో తెలుసుకుందామని.

తన రాకకు భరతుడు ఆప్యాయంగా ఎదురుచూస్తూ వున్నట్లు తోచినప్పుడే తాను వస్తున్నట్లు చెప్పవలెననీ, ఏమాత్రం అసంతృప్తి తోచినా చెప్పవద్దనీ, తాను తిరిగి అడవులకు వెళ్లిపోగలననీ హనుమతో చెప్పడంవల్ల - రామునికి భరతునిమీద స్వల్పమైనాసరే-అనుమానం ఉన్నట్లు తెలుస్తున్నది.

కాని-నిష్కపట హృదయుడైన భరతుడు రామునికోసం ఎంతో తహ తహ పాటు పొందాడు.

శ్రీరాముని చూడగానే అతని బరువు తీరినట్లయింది.

భరతుని సౌశీల్యాన్ని ప్రకటించడానికి ఇంతకంటె మరేమి కావాలి? ●



# పిచ్చివాళ్ల లోకం

వల్లూరి విజయకుమార్

పార్వతి యిచ్చిన కాఫీ తాగి, విశ్రాంతిగా వరండాముందు నిలబడ్డాడు చలపతి. సగం నెరిసిన జుత్తుని మునివేళ్లతో సరించుకుని వోసారి అటూ యిటూ చూసాడు. అరగంట క్రితం పేపరు కుర్రాడు పడేసివెళ్లిపోయిన పేపరు వొంటరిగా బిక్కు బిక్కుమంటూ కనిపించింది.

ఒంగి, పేపరందుకుంటున్న చలపతికి, యేదో గుర్తొచ్చి ఒక్కక్షణం వళ్లు జలదరించింది,

'ఇవాళే కదూ, లాటరీ రిజల్సు వస్తాయి' మెల్లిగా గొణుక్కున్నాడు. అతనిచేతులు నెమ్మదిగా పేజీలు తిప్పుతూంటే, కళ్లు గబగబా రిజల్సుకోసం వెతుకుతున్నాయి. మధ్యపేజీలో అతనికి కావల్సింది కొట్టొచ్చినట్టు కనపడింది.

మరో రెండు నిముషాల్లో ఓ చేత్తో లాటరీ టికెట్లు పట్టుకుని పేపరు ముందు కూర్చున్నాడు.

ఖాళీ గిన్నెల వునికిని తెలియ చెయ్యటాని కన్నట్టు వంటింట్లో పార్వతి చేసే గిన్నెలశబ్దం చలపతి నెత్తిమీద సమ్మెటలపెట్టులా వుంది. 'అమ్మా' నా పెన్సుపోయిందే, నాన్నతోచెప్పి మరొకటి కొనిపించవూ?' అంటూ పెద్దాడు నాన్నకి వినిపించేలా గట్టిగా అమ్మకో ఫిర్యాదు చేస్తున్నాడు. బాబిగాడెందుకో యేడుపు లంకించుకున్నాడు. వాడెప్పుడూ యింతే. సరదా పుట్టినప్పుడల్లా యేడుస్తూంటాడు, కారణం లేకుండానే. 'ఛీ, ఈపలక యేం బాలేదు' అన్న నానిగాడి గొంతూ, మరోక్షణంలో పటపట లాడుతూ విరిగిపోయిన పలకశబ్దం వినిపించాయి చలపతికి.

'ఛీ ఛీ, ఈ కొంపలో మనుషులు వొక్కక్షణంకూడా నిశ్శబ్దంగా వుండరు కదా!' మనసులోనే విసుక్కుంటూ, తన పనిలో నిమగ్నుడయి పోయాడతను.

'ఊహూ,...యిదికాదు...అరే, రెండు నెంబర్లలో పోయింది! అబ్బ. వొకే నెంబరుతేడా! ఛీ, యిది కొనేసుంటే లక్షరూపాయలూ నావేకదా! అప్పటికీ యేజంటు అంటూనే వున్నాడు 'తీస్కోండి సార్' అని. నేనే అక్కర్లేదన్నాను.

నిరాశగా మరోటికెట్టువైపు చూసాడు చలపతి.

చలపతికి ఈసారీ నిరాశే మిగిలింది. కొన్న పదిహేను టికెట్లూ నిరాశగా నవ్వాయి. ఒకటా రెండా, పదిహేను రూపాయలు! చలపతి హృదయం కలుక్కుమంది. అతనిముందు నిర్జీవంగావున్న కాయితం ముక్కలని పదిహేను రూపాయలకి కొన్నాడు అంతకుముందు. ఇప్పుడు వాటికి పైసాకూడా విలువలేదు.

అనుకోకుండా రెండు కన్నీటిచుక్కలు జారి పేపరుమీద పడ్డాయి. 'పోనీ లక్ష రూపాయలు రాకపోయినా వందకూడా రాలేదే' అనుకున్నాడు బాధగా. 'ఇంతకీ నా కదృష్టంలేదు' అంటూ వోదార్చుకుని బరువుగా తలెత్తాడు.

ఏనాడో కొన్న పాతచీరెతో, జిడ్డు కారుతున్న ముఖంతో ముందు నిల్చున్న పార్వతివైపు సూటిగా చూడలేక పోయాడు. తప్పు చేసినవాడిలా తలదించుకున్నాడు.

'ప్రతిసారీ పదులూ ఐదులూ తగలెయ్యటం మామూలేకదూ, చెపితే వినిపించుకోరు. అదేం లాటరీ పిచ్చో! యిప్పటికి ఆరు డ్రాలయాయి, యేం లాభం?' పార్వతి కంఠంలో బాధకన్న అసహనం, అసహ్యం, స్పష్టంగా తెలుస్తున్నాయి. పదిహేను టికెట్లని బొత్తిగా పట్టుకున్నాడు చలపతి.

'మనమేం లక్షాధికారులం కాదు. డబ్బు

నిలా తగలేసుకుంటుంది. తాతలు సంపాదించిన ఆస్తేమన్నావుందా అంటే అదీ లేదు. ఇవాళప్పుడే యిరవై ఐదో తారీఖు. చూస్తున్నారుగా. యింట్లో అన్నీ నిండుకున్నాయి. పెద్దాడికి పెన్ను కావాలిట. నానిగాడు పలక విరిచేసి బడికి వెళ్లనని పంతం పడుతున్నాడు...

పార్వతి మాటలు వినాలనిపించలేదు చలపతికి. విని అతను చెయ్యగలదేమీ లేదు కూడా. 'అదృష్టమనేది మనని వెతుక్కు రావాలి' అనే మనస్తత్వం పార్వతిది. కానీ చలపతికి మాత్రం, మనమే అదృష్టాన్ని వెతుక్కోవాలనీ అదెన్నటికీ మనుషులని వెతుక్కుంటూ రాదని ఓ గాఢ నమ్మకం.

చలపతి జీవితాన్ని ప్రారంభించి నప్పటి నుండీ, కనిపించని అదృష్టం కోసం, కనిపించే దోవలన్నీ వెతుకున్నాడు. అదృష్టం కాదుకదా, కనీసం దాని నీడయినా అతని కంటపడలేదు.

మేకునున్న కండువా భుజంమీద వేసుకుని భారంగా బయటకి నడిచాడు చలపతి. వెనుకనుంచి పార్వతి హెచ్చరింపులు వినిపిస్తూంటే, అలాగే అన్నట్టు బుర్ర వూపుతూ గడప దాటాడు.

పెద్దగా యేం చదవకపోయినా, వో గవర్నమెంటాఫీసులో చిన్న గుమాస్తాగా వుంటున్నాడతను. యవ్వనంలో వుండగా లయ్యని కలలు కనే చలపతికి, యిప్పుడు కలలుకనేందుకయినా తీరిక లేనన్ని కష్టాలు. కుటుంబ భారంతో నడుమయితే వంగలేదు కానీ మనిషిలో ముసలి ఛాయలు తొంగి చూస్తున్నాయి. అనాదిగా అతను చేస్తున్న సేవలనుంచి తొలగించి, మరో రెండేళ్లలో అతనికి విశ్రాంతి కల్పించాలని ప్రభుత్వం దయతో తీర్మానించేసింది.

ఒంటరిగా నడుస్తున్న చలపతికి యేం చెయ్యాలో పాలుపోవటంలేదు. అతనికిప్పుడు డబ్బు కావాలి. ఆ దారిని వెతకటానికి నిశ్చయించుకున్నాడు.

తలొంచుకుని అడుగులు వేస్తున్న చలపతికి రోడ్డుమీద యెవరో పారేసిన పనికిరాని లాటరీ టికెట్లు కనిపించాయి. 'ఎవరో నాలాంటివాళ్లే అయుంటారు!' అనుకున్నాడు. ఫలితం రానంతవరకు జాగ్రత్తగా బీరువాలో వుండే ఆ కాయితం ముక్కలు ఆతర్వాత రోడ్డుమీద పొర్లటం చాలా విచిత్రంగా వుంది. వాటి విలువ అంతే.

చలపతి ఆలోచనలు పరిపరి విధాల సాగుతున్నాయి. అర్థంకాని అదృష్టం గురించి ఆలోచిస్తూ, యింక యిప్పటి నుండీ యెప్పుడూ లాటరీజోలికి పోకూడదనే నిర్ణయానికి వచ్చాడు చలపతి.

* * *

జీతం అందుకుని జాగ్రత్తగా జేబులో పెట్టుకున్నాడు చలపతి.

సాయంత్రం ఐదుకాగానే గుర్నాధం వచ్చాడు 'యింక వెళ్దామా?' అంటూ.

అలాగే అంటూ తలాడించి, ఫైళ్ల దొంతిని జాగ్రత్తగా కట్టి, ప్యూనుకిచ్చి బీరువాలో పెట్టించాడు: తన రాకకోసం యెదురు చూస్తున్న గుర్నాధంతో, యిప్పుడే వస్తా వుండమంటూ మూలనున్న కూజాలో నీరు గ్లాసులో వొంపుకుని తాగి బయటపడ్డాడు చలపతి.

దోవపొడుగునా, గుర్నాధం సరదాగా యేవో కబుర్లు చెబుతూనే వున్నాడు. చలపతి అన్నింటికీ మౌనంగా వూ కొడుతూ నడుస్తున్నాడు.

హఠాత్తుగా గుర్నాధం మాటలు ఆపి, 'రావోయ్,' అంటూ పక్కనున్న దుకాణంలోకి దారితీసాడు. చలపతి అయిష్టంగా బయటే నిలబడి పోయాడు.

'అదేం? అక్కడే నిల్చున్నావు? యిలారా వోసారి.' దుకాణంలోంచి గట్టిగా కేకేసాడు గుర్నాధం. అన్యమనస్కంగా లోపలికి నడిచాడు చలపతి.

'ప్రతీసారీ కొనేవాడివి, యివాళ బయటే నిల్చుండి పోయావేం?' గుర్నాధం దేనిగురించి అడుగుతున్నాడో చలపతికి తెలుసు.

'ఎందుకూ, డబ్బు దండగ! అయినా నాకంత అదృష్టం లేదులే' అన్నాడు మెల్లిగా.

'అదృష్టం వుందో లేదో కొంటేకదా తెలియటానికి' గుర్నాధం హెచ్చరింపుతో చలపతి మనసు కొంచెం యిటూ అటూ వూగింది.

'నిజమే' అనుకున్నాడు.

'మాష్టారూ, మీకు తెలుసో తెలియదో, కిందటిసారి నాదగ్గర ఓ ముసలావిడ టికెట్టు కొంది. నేనావిడని బాగా యెరుగుదును. చెబితే నమ్మరుకానీ ఆవిడకి పదివేలొచ్చాయండీ! ఇద్దరు కాలేజీ స్టూడెంట్లకి చెరో వందా వచ్చాయి. యిద్దరూ నాదగ్గర కొన్నవాళ్లే!' ఏజంటు మహోత్సాహంగా వ్యాపార సరళిలో మాట్లాడుతూ అరచేతిలో చాలా సులభంగా స్వర్గాన్ని చూపించేస్తున్నాడు.

'పోనీ వొక్కటి కొంటే యేం?' అన్పించింది: చలపతికి అసలు మనసులో కొనాలనేవుంది. కానీ తీరా పార్వతికి తెలిసాక యేమంటుందో అనే భయంవల్ల కొంచెం తటపటాయించాడు. మనసు కొనెయ్యమని పదే పదే తొందర చేస్తున్నాది. టికెట్టు కొనకూడదని లోగడ అతను తీసుకున్న నిర్ణయం ఆ క్షణంలో నామరూపాలు లేకుండా పోయింది. ఆశగా జేబులో చెయ్యిపెట్టాడు. అయిదు రూపాయల కాయితం తగిలింది.

గుర్నాధం చాలాసేపు లెఖ్ఖలుకట్టి, ఆఖరికి మూడు టికెట్లు పుచ్చుకున్నాడు.

'నాకూ ఓ టికెట్టియ్యి' చలపతి ఐదురూపాయలనోటు ముందుకి చాచాడు.

'ఒకటేవిటండీ, ఐదువరసలు రిలీసయాయి' రకానికి వోటి పుచ్చుకోండి మాస్టారూ. ప్రతిసారీ కొనేమీరే ఈసారి వెనకాడితే యెలా? అబ్బే!' పెదవి విరిచాడు యేజంటు.

టికెట్ల దొంతిని తమాషాగా గాల్లో వూపుతూ 'చెప్పండి' ఒక్కటే యివ్వనా?' అన్నట్టు చూసాడు.

చలపతి మరేం మాట్లాడలేక పోయాడు. 'సరేయివ్వు' అంటూ చెయ్యి ముందుకి సాచాడు.

రకానికి వొకటిచొప్పున ఐదుటికెట్లూ చింపుకుని, జాగ్రత్తగా నలిగిపోయిన కోటు జేబులో పడేస్కుని బయట్పడ్డాడు చలపతి.

'ఈ రోజు పేపరు చూసావా?' గుర్నాధం ప్రశ్నించాడు.

'లేదులే, యేం?'

'ఏం లేదూ, అదేదో వూళ్లో రోడ్డుమీద తిరిగే నలుగురు ముష్టి వెధవలు చందా వేసుకుని వో టికెట్టు కొన్నారట. తీరా వాళ్లకే లక్ష రూపా

యటూ దక్కాయి. దాంతో వాళ్ళమధ్య తగాదావచ్చి నలుగురూ కొట్టుకున్నారట. వాళ్ళలో యిద్దరు చచ్చారు. తీరా, యింతకీ ఆ టికెట్టు యెక్కడో పారేసుకున్నారట ... గుర్నాథం చెప్పటం మాని గట్టిగా నవ్వాడు.

చలపతికి నవ్వాలో యేడవ్వాలో తెలీ లేదు.'

'ఏమిటో, డబ్బులోనే వుంది లోకం!' నగ్నసత్యం తెల్పుకున్నట్టు అన్నాడు గుర్నాథం.

'మరేం' అన్నాడు చలపతి.

మరో నాల్గడుగులు నడిచేలోగా, 'నే వస్తా' అంటూ పక్కసందులో దూరి మాయమయ్యాడు గుర్నాథం. తనకి తోడుగా మనసులో లెక్కలేనన్ని ఆశలు నింపుకుని వడివడిగా కొంపవైపు నడక సాగించాడు చలపతి.

* * *

ఆమాటా యీమాటా మాట్లాడుతూ' 'యేం? యీమారింకా లాటరీ టికెట్లు కొన్లేదు?' అనడిగింది పార్వతి.

ఏం జవాబు చెప్పాలా ? అనే సందిగ్ధంలో పడ్డాడు చలపతి.

'అబ్బే ! లేదే. ఒక్కటికూడా కొన్లేదుస్మీ ! కొనదల్చుకోలేదు. పోనీ కొన్నా, నీ చేతిమీదుగా వొక్కటి కొందామనుకుంటున్నా. ఏమంటావ్?' అన్నాడు చలపతి.

పార్వతి జవాబు చెప్పలేదు. ఆమెని అతను మళ్ళీ అడగనూ లేదు.

భర్త జవాబుకి పార్వతి హృదయం ద్రవించిపోయింది.

'పాపం, పిచ్చి బాగులవాడు!' అనుకుంది. పైకి అప్పుడప్పుడు కఠినంగా మాట్లాడినా పార్వతి హృదయంలో చలపతిని యెన్నడూ పూజిస్తూ వుంటుంది. చలపతిని గురించి ఆలోచిస్తున్న కొద్దీ, ఆమె కళ్ళలో నీరు గిర్రున తిరగసాగింది. భర్త గమనించకుండా చీరెకొంగుతో కళ్ళద్దుకుని, మాట మార్చేసింది. కానీ, ఆమెకి తెలుసు, చలపతి ఈసారికూడా టికెట్లు కొన్నాడని!

కనిపించని అదృష్టాన్ని వెతికే భర్త మనస్తత్వానికి ఆమె జాలిపడని క్షణంలేదు.

# పిచ్చివాళ్ళలోకం

ఏదేలావున్నా చలపతిలాంటి భర్తని పొందటం ఆమె తన అదృష్టంగా భావిస్తుంది. పార్వతిలాంటి భార్యవల్లే తనింకా యీ మాత్రమయినా ఆశతో జీవిస్తున్నాననుకుంటాడు చలపతి యెప్పుడూ.

* * *

రోజులు ఒకదాన్నొకటి గబగబా తరుముకు పోతున్నాయి. రిజల్ట్సు యింకా రేపొస్తాయనగా చలపతి గుండెల్లో గుబులు ప్రారంభమయింది. రాత్రిళ్ళు కంటినిండా కునుకు తియ్యలేక పోతున్నాడు.

చలపతి నిరీక్షించిన రోజు రానే వచ్చింది. కావాలనే ఆ రోజు చలపతి కాస్త ఆలస్యంగా లేచాడు. దంతధావన ముగించుకుని వరండాలోకి రాగానే ఆరోజు దినపత్రికలో బొమ్మలు చూస్తున్న పిల్లలు కనపడ్డారు. పేపరు చూడగానే చలపతి గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి.

పార్వతి వేడికాఫీతెచ్చి. బల్లమీద పెట్టి కొంగుతో చెయ్యి తుడుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

యాంత్రికంగా గోడవారనున్న రేకు పెట్టెవైపు నడిచాడు చలపతి బట్టలన్నీ పైకితీసి అడుగునదాచిన ఐదు టిక్కట్లూ వణుకుతున్న చేతులతో పట్టుకున్నాడు. వాటివైపే ఆశగా చూస్తూ, చెంపలు నిమురుకున్నాడు. చేతికి గరుగ్గా గడ్డం గుచ్చుకుంది.

'పెద్దబ్బాయ్, పేపరిలాతే' అరిచాడు చలపతి.

కొడుకు పేపరందించి, నానిగాడితో దెబ్బలాడ్డానికి వెళ్ళిపోయాడు. వంటింట్లో పార్వతి పోపు వేయిస్తున్నాది.

పేపరు మడతలు విప్పి, ముందు పరచుకున్నాడు చలపతి. దానిమీద ఐదు టికెట్లూ పెట్టాడు. అతనికళ్ళు తీక్షణంగా ఒక్కొనెంబరునీ గమనిస్తున్నాయి.'

ఊహు ... యిదికాదు. మొదటి టికెట్టుని పక్కకి నెట్టేసాడు. రెండు... మూడు...పోనీ నాల్గు...అస్సలు యేం లాభం లేకపోయింది. ఆఖరిదానివైపు చూడటానికి భయం వేసింది చలపతికి. అస్పష్టంగా గొణుక్కుంటూ చూపులు సారించాడు.

పేపర్లోని అంకెలవంకే చూస్తున్న చలపతి ఒక్కక్షణం చలనరహితంగా వుండిపోయాడు. అతని కళ్ళుమాత్రం ఆఖరి వరసలో అన్నిటికన్న ముందున్న అంకెల మీదే కేంద్రీకృత మయాయి.

'ఇది...యిది...నా టికెట్టు నెంబరే సుమా!' యివేమాటలు మరోసారి గొణిగాడు చలపతి. కళ్ళని నమ్మలేక జారిపోయే కళ్ళజోడుని యెగతోసి మరీ చూసాడు. ఆ అంకెలు మారలేదు. పైపెచ్చు మరింత స్పష్టంగా కనిపించసాగాయి.

పేపరు మరింత దగ్గరగా తీసుకుని, వణుకుతున్న చూపుడు వేలుతో ఆ అంకెల మీద రెండుమూడుసార్లు రాసాడు. ఏనాటి నుండో అతనిలో వోమూల అణగారిన ఆనందం ఒక్కసారి పెల్లుబ్బింది. అంత ఆనందాన్ని ఒక్కడూ భరించలేక పోతున్నాడు.

'పార్వతీ' గట్టిగా అరిచేడు.

ఉలిక్కిపడింది పార్వతి. ఏమయ్యుంటుందో గ్రహిస్తూ వంటింట్లోంచి వచ్చేలోగా మరో రెండుసార్లు కేకేసాడు చలపతి.

నాన్న అరుపుకి, బయట పిల్లలు చేస్తున్న అల్లరి ఆగిపోయింది. వీధి లోంచి బాబిగాడి తలకాయ తొంగి చూసింది.

'పిల్లలూ, రండ్రా!' ఆనందంగా మరోసారి అరిచాడు. ఆదరాబాదరా అక్కడికొచ్చిన వాళ్ళందరికీ వొచేత్తో లాటరీ టికెట్టు పట్టుకున్న చలపతి కనిపించాడు.

చలపతి కళ్ళు మెరుస్తున్నాయి. చిరిగిపోయిన నిక్కరు యెగలాక్కుంటూ సగం విరిగిన బొత్తాన్ని బిగించటానికి ప్రయత్నిస్తున్న బాబిగాడు, మాసిన చొక్కాతో ముక్కు తుడుచుకుంటున్న నానిగాడు, బట్టలనిండా సిరామరకలతో పెద్దబ్బాయి, చిరుచెమటలు తుడుచుకుంటూ యెదురుగా నిల్చున్న పార్వతి! యింతమందినీ ఒకేసారి చూడగనే చలపతి ఆనందం పట్టలేక పోయాడు.

ఒక్క వుదుటున బాబిగాడిని మీదకి లాక్కుని, ముద్దులతో! ఉక్కిరి బిక్కిరి

వేసేసాడు. వెధవాయ్, యికమీద నీకే నిక్కర్లొద్దులేరా, టెరికాట్ బట్టలు కుట్టిస్తాను. అన్నాడు. కొత్తబట్టల పేరు వినగానే వాడిముఖం యింతై పోయింది.

పెద్దబ్బాయ్! నీకో మాంచి పార్కర్ పెన్ను... నానిగా, నీకేం కావాలా? ... అందరితోనూ దకదకా మాట్లాడేస్తున్న చలపతి ఆప్యాయంగా పార్వతివైపు చూసాడు.

పార్వతి కంఠంనుంచి మొదటిసారిగా వెలువడినమాట 'కాఫీ'. 'కాఫీ తాగలేదా?' అని అడుగుతున్నదామె.

'ఓసి వెర్రిదానా! కాఫీ యెందుకే? మనం యికమీదట హార్లిక్సు తాగుదాం.'

చలపతి పకపకా నవ్వాడు. చూసావా, చూడు. యిలా చూడు, మనకి లాటరీలో లక్షరూపాయ లొచ్చాయి' పార్వతిని పేపరు ముందు కుదేశాడు.

'లక్షరూపాయలు!' పార్వతి విస్తుపోయింది. కానీ నమ్మక తప్పింది కాదు.

ఇప్పుడేమంటావ్? అన్నట్టు చూసాడు పార్వతివైపు.

'సారూ, నేనే అదృష్టాన్ని వెతుక్కుంటూ వెళ్లాను' హుందాగా అన్నాడు చలపతి.

పార్వతి కళ్ళు వర్షించాయి. ఇటువంటి రోజుని తన జీవితంలో చూడగలననుకోలేదామె. టికెట్టుని లాల్చీ జేబులో వేసుకుని యిప్పుడే వస్తానంటూ బయట పడిపోయాడు చలపతి.

'ఎక్కడికండీ' అంటూ అతడి నాపిన భార్యవైపు చూసాడు.

'ఎక్కడి కేమిటే, రిజిస్ట్రాఫీసుకి! త్వరగా వచ్చేస్తానే' అంటూ చలపతి పార్వతి పిలుపుని వినిపించుకోకుండా పరుగులాంటి నడక సాగించాడు.

బల్లమీది కాఫీ యిదేం అర్థంకానట్టు చప్పగా చల్లారిపోయింది.

* * *

హృదయం చిందులేస్తూంటే నడుస్తున్నాడు చలపతి.

ఎవరో పిలిచినట్టయి వెనక్కుతిరిగాడు. గుర్నాధం, పరంధామయ్యతో వస్తూ కనిపించాడు.

# పిచ్చివాళ్లలోకం

'ఎక్కడి కింతపొద్దున్నే? ఏమిటి విశేషం ?' యిద్దరూ వాకేసొరడిగారు.

తనకి కలిగిన యీ అదృష్టం గురించి నింపాదిగా వాళ్ళకి చెప్పి ఆశ్చర్య పరుద్దా మనుకున్నాడు చలపతి. అందుకే 'అబ్బే ! మరేంలేదూ...యిలా, తెల్సిన వాళ్లని చూసొద్దామనీ...వస్తా' అంటూ జవాబు కెదురుచూడకుండా నడక సాగించాడు.

అంత వేగంగా నడుస్తోంటే చలపతికి ఆయాసంగా వుంది. యవ్వనపు తొలి ఛాయల్లో యెన్నో పరుగుపందేల్లో పాల్గొన్న రోజులు గుర్తొచ్చి నవ్వుకున్నాడు. ముఖానికి పట్టిన చమటని లాల్చీ జేబులోని రుమాలుతో తుడుచుకుంటూ, మనసులో యెన్నో కోటలు కట్టుకుంటూ నడుస్తున్నాడు చలపతి. పగటి ఎండలో అతని నెరిసిన జుత్తు తమాషాగా మెరుస్తున్నది.

* * *

రిజిస్ట్రార్ ఆఫీసు జనంతో క్రిక్కిరిసిపోయింది.

అక్కడి వాళ్ళందరి ముఖాల్లోనూ యేదో జయించామనే ఆనందం!

చలపతి యెవరితో మాట్లాడకుండా ఓమూల నిల్చున్నాడు. అతని ఆలోచనలు ఒకవిధంగా సాగటంలేదు. 'ఇక్కడివాళ్ళకి నాకు లక్షరూపాయ లొచ్చినట్టు తెలిస్తే!' ఊహించుకుంటున్నాడు:

'చాలా అదృష్టవంతులండీ మీరు' అంటారు కొందరు. కొందరు ఆశ్చర్యంతో కళ్లింతలు చేసుకుని చూస్తారు, కొందరు అసూయపడతారు. హు ఎవరెలా గయితే నాకేం? చలపతికి మరొక్కసారి తన లాటరీటికెట్టు చూడాలనిపించింది.

లాల్చీ జేబులోకి చెయ్యి పోనిచ్చాడు. రుమాలుమాత్రం బయటికి వచ్చింది. గాభరాగా జేబంతా మరోసారి వెతికాడు. లాటరీ టికెట్టులేదు. జేబులో కావల్సినంత గాలి!

'నా టికెట్టు!' గావుకేక పెట్టాడు చలపతి. అందరివైపు వెర్రిగా చూశాడు శరీరం వణికిపోతున్నాది.

చలపతి కేకతో అంతా వులిక్కిపడ్డారు. అందరికళ్లు అతనివైపు తిరిగాయి. వాళ్ళకి మాసినగడ్డంతో మాసిన దుస్తుల్లో చలపతి కనిపించాడు.

చలపతి తటాలున నేలమీదకు వంగి వెతకం ప్రారంభించాడు. అడ్డుగావున్న కుర్చీలనీ బల్లలనీ గాభరాగా తోసేస్తూ, చుట్టూవున్న వాళ్లని లెక్క చెయ్యకుండా, వాళ్ళనికూడా పక్కకి తోసేస్తూ, చూపులతో నేలనీ, మూలమూలలనీ వెతుకుతున్నాడు చలపతి.

'ఏమయిందండీ?' యిద్దరు చలపతిని నిలదీసారు.

'నాటికెట్టు చూశారా?'

'ఏం టికెట్టు?'

'నా లాటరీ టికెట్టు' చలపతివాళ్ళని తటాలున తోసేసి వెతకసాగాడు.

ఆ వూపుకి యిద్దరూ పడిపోయారు.

'అదేంటయ్యా, అలా తోసేస్తావు?' ఎవరో అరిచారు. గొడవ యెక్కువయింది. గుంపులో వొకడు చలపతిని బలవంతంగా ఆపాడు. 'ఎన్ని రూపాయల ప్రయిజు వచ్చింది?' అడిగాడు.

'ఏం? నీ కెందుకు? లక్ష. నన్ను వెతుక్కోనియ్యి...'

చలపతి గింజుకున్నాడు.

'లక్షా!' గుసగుసలు ప్రారంభం అయ్యాయి.

ఈ వెర్రి మొహానికి లక్షరూపాయలా? అసలు వచ్చిందగ్గరనుంచీ చూస్తున్నా అలా మూలగా నక్కాడు. దొంగవెధవ



యుంటాడు స్మీ! మరోగొంతు చలపతెవరో తెల్చిపారేసింది తేలిగ్గా!

'వ్వ్' పాపం నిజమే అయుంటుంది' అక్కడోళ్లని సానుభూతి కనపరిస్తారొకరు.

'ఆ బడాయి. వెధవ్వాలకం చూస్తే తెలిటంలేదూ? యే పిచ్చివెధవో అయుంటాడు. లాటరీపిచ్చి ఈమధ్య అందరికీ లెగ పడుతోంది సుమా!

చలపతికి యిష్టంలేకపోయినా ఈ మాటలు అతనిచెవిన పడుతూనేవున్నాయి.

'నా పర్సు, నాపర్సు' ఈ సందడిలో మర్రో గొంతు.

'ఈ దొంగవెధవే అయుంటాడు, పట్టుకోండి' యిందాక చలపతిని దొంగగా మార్చిన పెద్దమనిషి అరిచాడు. అతని మాటలు ముగిసేలోగా నలుగురూ చలపతి చుట్టూ పోగయారు. దబదబా నాల్గు యిదు బాదులు బాదేసారు. చలపతి ఖాళీ జేబులు తడిమి కసిగా పక్కకి తోసేసాడు పర్సు పోగొట్టుకున్న ఆసామి. ఒక్క వూపున చలపతి బయట పడ్డాడు. దుస్తులు వాలాచోట్ల చిరిగిపోయాయి. జరిగిన, అనుకోని సంఘటనకి నిర్ఘాంత పోయాడు. ఆలోచనాశక్తి పోయింది చలపతిలో. అతని మనసులో పారేసుకున్న లాటరీ టికెట్టుమాత్రం మెదులుతూంది.

గబగబా రోడ్డుమీదకి పరిగెత్తాడు. రోడ్డు కిటూ అటూ వున్న మట్టిని ఆత్రంగా కెలుకుతున్నాడు. దోవలో యే కాయితంముక్క కనిపించినా పరిగెత్తు కెళ్లి దాన్ని తీసుకుంటున్నాడు. తీరా చూస్తే, అది లాటరీటికెట్టు కాదు. నిరాశగా దాన్ని కిందపడేసి కంటికి కనిపించిన మరో కాయితంవైపు పరుగు తీస్తున్నాడు.

రోడ్డుమీది జనం చలపతిని వింతగా చూస్తున్నారు. 'పిచ్చివెధవ' ఆమాట అంటూంటే ప్రతివాళ్లకీ యేదో తృప్తి. అలా అన్నప్పుడల్లా చలపతి వెతకటం మాని వాళ్లని విచిత్రంగా చూస్తున్నాడు.

చలపతి మెదడులో తుఫానులు రేగుతున్నాయి

రాదు రాదనుకున్న ఘడియ తానే వచ్చి చల్లగా చెయ్యి జారిపోతే యెలా వుంటుంది? ఎదురుచూసిన మధురక్షణంలో పత్తాగా



# పిచ్చివాళ్ళలోకం

నిద్రించి గతించిన క్షణాన్ని తల్చుకుని విచారించటంతో యెంత బాధుంటుంది? అలానే వుంది చలపతి పరిస్థితి కనిపించిన వాళ్ళందరినీ ఆపుతున్నాడు. 'నా లాటరీ టికెట్టు చూసారా?' అని అడుగుతున్నాడు.

జవాబు చెప్పినవాళ్ళు చెబుతున్నారు, లేనివాళ్ళు లేదు.

'నాటికెట్టు... లాటరీ టికెట్టు...' గొణుగుతూనే అన్వేషణ సాగించాడు.

బజారునించి యింటికి వెళ్తున్న పరంధామయ్యకీ, గుర్నాధానికి మట్టి జారిన చేతులూ, చెదరిన జుత్తు, చిరుగు దుస్తులతో కనిపించాడు చలపతి. జరిగిందేమిటో యిద్దరికీ అవగతం కాలేదు. పరుగెత్తుకెళ్ళి చలపతిని ఆపారు.

'చలపతీ, యేమయిందోయ్?'

'నా లాటరీ టికెట్టు పోయింది. మీరు కానీ చూసారా?' ఆతగా అడిగాడు.

'లాటరీ టికెట్టా?' ఆశ్చర్యపోయారిద్దరూ.

'అవును. రిజిస్ట్రారాఫీసుకి వెళ్ళాను. లక్షరూపాయలొచ్చాయని. తీరా యిప్పుడు కనిపించటంలేదు. మీరు, చూసారా?'

గుర్నాధం యిదేం నమ్మటం లేదు. గంటక్రితం చలపతి బానే వున్నాడే, యెవరినో చూడ్డానికి వెళ్తున్నానని చెప్పాడు. యిప్పుడిలా అంటాడేమిటో! బోధపడలేదు.

'చలపతికి లాటరీ పిచ్చి పట్టుంటుంది' పరంధామయ్య చెప్పలు కోరికాడు. ప్రతిసారీ పదీ పదిహేను టికెట్లు కొంటాడు గా! యెప్పుడూ రాలేదు మరి...వ్చ్'

'అంతే అయుంటుంది' గుర్నాధం నిశ్చయిం చేసాడు. అయితే మాతో రావా? అడిగాడు చలపతిని.

'నా టికెట్టు చూసావా?' చలపతి యెదురు ప్రశ్న వేసాడు.

'పిచ్చే, సందేహం లేదు' ఒకసారి గట్టిగా అన్నాడు పరంధామయ్య. చలపతి తన మిత్రులే యిలా అంటారనుకోలేదు. పిలుస్తున్నా వినిపించుకోకుండా గుర్నాధం, పరంధామయ్య వెళ్ళిపోయారు.

చలపతి మళ్ళీ అన్వేషణ సాగించాడు.

దూరంగా వస్తున్న యెడ్లబండిలో రోడ్డుమీదున్న చెత్తా చెదారం చేరవేస్తున్నాడు బండివాడు హుషారుగా. చలపతి వాడివైపు పరుగెత్తాడు. వొగర్చుకుంటూ వాడిముందు నిలబడ్డాడు.

ఏటయ్యా...ఏటి?

నా లాటరీ టికెట్టు ... నువ్వు చూసావా? చేతులతో అభినయిస్తూ చెప్పాడు చలపతి.

'ఏహె, లెగు, లెగు, ఆప్కో బూనువ్వూ...' బండివాడు యెడ్లని అదలించాడు.

'నన్నొక్కసారి ఆ చెత్తలో చూడనియ్యవూ? నా టికెట్టు యిందులో వుందేమో...చలపతి జాలిగా బండి వెనుక పరిగెత్తాడు.

'ఓరి యెంకా!' బండివాడూ పొట్ట చెక్కలయ్యేలాగ నవ్వటం సాగించాడు. బండి ఆగలేదు. కదిలిపోయింది.

'ఓరేయ్, పిచ్చోడా, నూస్కో వడా, సత్తాన్' బండివిడాంచి అరిచాడు వాడు.

చలపతి కదిలిపోయే బండిని కన్నార్పకుండా చూచాడు. అతనికీ తెలీదు...బండి వాడికీ తెలీదు... ఆ బండిలో, అడుగున, పెంటలమధ్య ఓ లక్ష రూపాయల విలువ గల లాటరీ టిక్కెట్టు మగ్గిపోతున్నాదని!

తనని పిచ్చివాడుగా భావిస్తున్న వాళ్ళని చూస్తుంటే చలపతికి నవ్వాగటంలేదు.

గట్టిగా నవ్వుతూ, రోడ్డుమీది కాయితాలు యేరుకుంటూ అటే వస్తున్న భర్తని అంతదూరంనుంచి చూసింది పార్వతి. అప్పటిదాకా గుర్నాధం చెప్పింది నిజమని నమ్మలేదు. ఒక్క పరుగులో చలపతిని చేరింది.

భయంగా, 'యేనండీ. యేమయ్యింది?' అని అడిగింది.

'నా లాటరీ టిక్కెట్టు చూసావా?' చలపతి వికృతాకారంగా అడిగాడు. తల్లి వెనుకే పరిగెత్తుకొచ్చిన పిల్లలు భయం భయంగా తండ్రిని చూస్తున్నారు.

'చూడలేదూ? ఊఁ' చలపతి నిలదీసాడు.

'నాన్నా' అన్నాడు నానిగాడు.

ఒక్క గెంతులో చలపతి వాణ్ణి చేరుకున్నాడు. వాడి భుజంపట్టి కుదుపుతూ 'నువ్వు చూసావా? నాది నా కిచ్చెయ్యవూ?' అడిగాడు బ్రతిమాలుతున్నట్టు. నానిగాడు, 'అమ్మో' అంటూ యేడ్పు లంకించుకున్నాడు.

'నాన్నకి పిచ్చెక్కింది బాబోయ్' పెద్ద బ్బాయి పరిగెత్తాడు అక్కడినుండి.

చలపతి నానిగాడి భుజంమీంచి చెయ్యి తీసేసాడు.

తను వీళ్లని లాటరీ టికెట్టుగురించి అడుగుతూంటే జవాబు చెప్పకుండా తనని పిచ్చి వాడంటారేమిటో! అనుకున్నాడు. 'చూసాను, చూడలేదు. ఏదో వొకటి చెబితే నాదారిని నే పోతానుగా. ఎందుకీ యేడ్పు?' పార్వతి వైపు చూసాడు విచిత్రంగా.

పార్వతి వస్తున్న దుఃఖాన్ని ఆపుకో లేక పోతూంది. ఇటువంటి రోజుని తన జీవితంలో చూడవలసి వస్తుందనుకో లేదామె.

పిచ్చివాడు...హహ... నేనా పిచ్చివాడ్ని నిజంచెప్పినా నేను పిచ్చివాడినే అవుతానా? అనవసరంగా నన్ను పిచ్చివాడంటారేమిటో ఈ లోకం? చలపతి ఆలోచనా పూరితంగా ఆకాశంవైపు చూశాడు.

అతనికిప్పుడు బోధపడింది. బహుశః ఈ లోకానికే పిచ్చి పట్టుండాలి. అందుకే తనని యిలా అంటున్నది.

పిచ్చివాళ్ల లోకంతో నాకేం సంబంధం? ఛ! నే నిక్కడుండను. ఈ పిచ్చివాళ్లలోకం నాకెందుకు? గొణుక్కుంటున్నాడు చలపతి. అతనికి ఈలోకం పిచ్చివాళ్ల లోకంగా కనపడింది.

'పిచ్చివెధవలు ... పిచ్చివాళ్ల లోకం యిది' తిట్టుకుంటూంటే, చలపతికి నవ్వాగింది కాదు.

'హహహ' గట్టిగా నవ్వుతూ రోడ్డు మీద యెదురుగా కన్పించిన కాయితం వైపు పరుగులిసాడు.

కనిపించిన ప్రతికాయితం ముక్కనీ పరిశీలిస్తున్నాడు చలపతి. ●

27–3–70

# గాలిద్వారా వ్యాధులు రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు

మనచుట్టూ సూక్ష్మజీవు లున్నాయని అందరికీ తెలుసు. కానివాటిని గురించి అదేపనిగా ఆందోళన చెందడం అంత మంచిది కాదు. ఎందుకంటే వాటితో మనం తప్పనిసరిగా సహజీవనం గడపాలి. అయితే వాటినుంచి రక్షించుకోడానికి కొన్ని ప్రాథమిక జాగ్రత్తలు తీసుకోడం చాలా అవసరం.

ప్రతిమనిషి సరాసరి రోజుకి 10,000 లీటర్ల గాలి పీలుస్తాడు. ధూళి అణువులమీద, నీటితుంపర్లలోనూ ఉండే సూక్ష్మజీవులు గాలిలో వేగంగా ప్రయాణం చేస్తాయి. మామూలుగా ఇళ్లలోఉండే దుమ్ములో గ్రాముకి 20 లక్షల సూక్ష్మజీవులుంటాయని అంచనా. మనంరోజుకి సాధారణంగా 3–4 లక్షల సూక్ష్మజీవుల్ని గాలిద్వారా లోపలికి పీల్చుకుంటాము. వాటిలో కొన్ని వ్యాధి జనకాలుంటాయి. అయినా మనం ఆరోగ్యంగా ఉండగలుగుతున్నామంటే మన శరీరానికి స్వభావ సిద్ధంగా కొన్ని ఆత్మరక్షణ మార్గాలున్నాయి కనక. ముక్కులో ఉండే వెంట్రుకలు ఫిల్టరులా పనిచేసి గాలిలో ఉండే దుమ్ము, ధూళిలోపలి పోకుండా కొంతవరకూ ఆపు చేస్తాయి. ఇంతే కాకుండా ముక్కులో ఉండే జిగురు పొరల్లో కొన్ని బాక్టీరియా పట్టుబడి పోతాయి. నోటితో గాలిపీల్చడం చెడ్డ అలవాటు. ఎందుకంటే అలా చేస్తే సూక్ష్మజీవులు లోపలికి పోకుండా ఉండడానికి రక్షణ తగ్గిపోయి శ్వాసకోశ వ్యాధులు వచ్చే అవకాశం ఎక్కువవుతుంది.

మనం మామూలుగా శ్వాసక్రియ జరిపేప్పుడు వదిలేగాలిలో సూక్ష్మజీవులుండవు. కాని గట్టిగా మాట్లాడినప్పుడు, తుమ్మినప్పుడు, కొన్నివేల (ఒక్కొక్కప్పుడు కొన్ని లక్షల) నీటి తుంపరలు బయటికొస్తాయి. వీటిద్వారా వ్యాధి జనక సూక్ష్మజీవులు వ్యాపిస్తాయి. అందుకని దగ్గినప్పుడు, తుమ్మినప్పుడు జేబురుమాలు అడ్డం పెట్టుకోడం చాలా అవసరం. మనందరి ముక్కుల్లోనూ, గొంతుకల్లోనూ వ్యాధి జనక సూక్ష్మజీవులుంటాయి. అవి మనకి హాని చెయ్యకపోవచ్చు. కాని ఇతరులకి హానిచేస్తాయి. అదేవిధంగా ఇతరుల శరీరంలో ఉన్న సూక్ష్మజీవులు వాళ్లకి వ్యాధుల్ని కలిగించకపోయినా మనకి హానికరం కావచ్చు.

మనం హాయిగా ఉండడానికి ఉష్ణోగ్రత, గాలిలో తేమ, గాలి చలనం—ఇవన్నీ ముఖ్యంగా గమనించాలి. ఉష్ణోగ్రత, తేమ ఎక్కువగా ఉన్నప్పటికీ ఫాన్ వేసుకుంటే హాయిగా ఉంటుంది — గాలి సంచలనంవల్ల. ఎయిర్ కండిషన్డ్ గదుల్లో ఉండే వారికి సూక్ష్మజీవుల బెడద అంతగా ఉండదు. కాని ఎయిర్‌కండిషనింగ్ సరిగా లేకపోతే—అంటే మరీ తక్కువ ఉష్ణోగ్రత, మరీ తక్కువ తేమ, మరీ ఎక్కువ గాలివేగం—ఆరోగ్యం పాడవుతుంది.

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి




### జరిగిన కథ

రాధాకృష్ణ పోయేసరికి పార్వతి గర్భవతి. ఆమె తప్పనిసరిగా రుక్మిణిని ఆశ్రయించవలసి వస్తుంది. బిడ్డని కని పార్వతి కూడా కన్ను మూసింది. ఆ పిల్ల మాధవి. రుక్మిణి దగ్గర మాధవి పడరానిపాట్లు పడ్డది. కళ్లారా చూసిన పరమేశ్వరి మాధవిని తనతో తీసుకు వెళ్ళిపోయింది. శ్యామల రాధలతోపాటు మాధవిని కూడా కన్నకూతురిలాగే పెంచింది. మాధవి ఉద్యోగం చేస్తూ వచ్చిన జీతాన్ని శివశాస్త్రికి ఇవ్వడం ద్వారా అతని అభిమానానికి కొంత పాత్రురాలు కాగలిగింది. మధు ఆ యింట్లో కొత్తగా అద్దెకు వచ్చాడు. రాధ అతనితో పరిచయం పెంచుకుంది. రాధ ఆరాధన మనసులోనే వుండిపోయింది. మాధవి అతనికి బాగా సన్నిహితురాలైంది.

## 4

కాలేజినుండి మాధవి ఇంట్లో ప్రవేశించబోయేసరికి లోపలినుండి శివశాస్త్రి మాటలు వినిపిస్తున్నాయి—

'ముందు పెద్దమ్మాయి శ్యామల కవ్వాలి — తర్వాత కాని మాధవికి చెయ్యం—అదీగాక మాధవికి హిస్టీరియా ఉంది — ముందు అది నయం చేయించి ఆ తర్వాత పెళ్లి సంబంధాలు చూడా లనుకుంటున్నాను—'

'ఆ! హిస్టీరియా ఉందా? వస్తా మండీ!'

లోపలినుండి ఎవరో గబగబ బయటి కెళ్ళిపోయారు—కొంచెంసేపు ఆశ్చర్యంతో అలానే నిలబడిపోయి లోపలకు నడిచింది మాధవి — మాధవిని చూసి శివశాస్త్రి గతుక్కుమన్నాడు—

'ఎంత సేపయింది మాధవీ నువ్వొచ్చి?'

'ఇప్పుడే వస్తున్నాను పెద్దనాన్నా!'

'ఆ! లోపలి కెళ్లమ్మా! కాస్త కాఫీతాగు— ముఖం చూడు ఎంత వడిలి పోయిందో? కాఫీతాగి విశ్రాంతి తీసుకో!'

భాగవత గ్రంథంలో తల దాచుకున్నాడు శివశాస్త్రి—

మాధవి లోపలి కెళ్లగానే మాధవిని కౌగిలించుకుని బావురుమంది పరమేశ్వరి—మాధవి కంగారు పడింది—

'ఏమిటి పెద్దమ్మా!'

'నీకు మేం చేసిన ఉపకారం ఉందో, లేదో కాని మొత్తం నీ బ్రతుకును సర్వ నాశనం చేస్తున్నాం మాధవీ!'

'ఏమిటా మాటలు పెద్దమ్మా! ఏం జరిగిందసలు?'

'మీ పెద్దనాన్నగారికి నీ పెళ్లి జరగటం ఇష్టం లేదమ్మా! ఇవాళ మన పక్కింటి శేషాచలంగారు నిన్ను చూసి ముచ్చటపడి కోడలిగా చేసుకోవాలని అడగటానికి వచ్చారు — నువ్వు పెళ్లి చేసుకుంటే నీ జీతం మాకు దక్కదని మీ పెద్దనాన్నగారు భయపడ్డారు—అందుకని వాళ్లతో నీకు హిస్టీరియా అని అబద్ధం చెప్పి......'

దుఃఖం ఆపుకోలేక పైటకొంగు నోటి కడ్డం పెట్టుకుంది పరమేశ్వరి—

మాధవి తేలిగ్గా నిట్టూర్చింది.

'ఓస్! ఇంతేనా? దానికింత బాధపడుతున్నావా పెద్దమ్మా? ఒకవేళ పెద్దనాన్న గారు ఒప్పుకున్నా నేను చేసుకుని ఉండే దాన్ని కాను—'

పరమేశ్వరి ఆశ్చర్యంగా చూసింది—

'అదేం మాధవీ? నువ్వు...' అను మానంగా ఆగింది పరమేశ్వరి—మాధవి కంగారుపడిపోయింది—

'అహ! పెద్దమ్మా ... శ్యామలక్కయ్యకు కాకుండా నేనెలా చేసుకుంటాను పెద్దమ్మా! ముందు శ్యామలక్కయ్యకు కావాలి—'

'మాధవీ!'

ఆప్యాయంగా మాధవి చెక్కిళ్లు నిమిరింది పరమేశ్వరి—

శ్యామలను చూసుకోవటానికి పెళ్లివారొచ్చారు. చాప మీద ఒదిగిపోతూ కూచుంది శ్యామల—

'అమ్మాయి కొంచెం నలుపు—'.

ఇకిలించింది పెళ్లికొడుకు తల్లి—

'మీ అబ్బాయి మహా తెల్లగా ఉన్నాడా?' అనబోయిన మాధవి ప్రయోజనంలేని తన పౌరుషాన్ని బలవంతాన నిగ్రహించుకుంది—

'పాటలు వచ్చా?'

'అంతగా రావండి—కుట్లు అల్లికలూ అన్నీ వచ్చు—'

'అవన్నీ ఎందుకు లెస్తురూ! ఇంకా ఏదైనా డిగ్రీ ఉంటే వేణ్ణీళ్లకు చన్నీళ్లుగా ఏదైనా ఉద్యోగంచేసి భర్తకు సహాయంగా ఉంటుంది—'

పాపం; శ్యామల తల భూమిలోకి దిగిపోయింది—

'సరేలెండి—కట్నం విషయం నిశ్చయమైతే, మిగిలిన విషయాలు ఎలాగైనా సర్దుకోవచ్చు—'

ఉదారంగా ప్రకటించింది పెళ్లికొడుకు తల్లి—

'వెయ్యిన్నూట పదహార్లు ఇచ్చుకోగలను—'

ఆ సమయానికి వెయ్యి నయాపైసలు కూడా లేకపోయినా, దీనంగా అన్నాడు శివశాస్త్రి—

'భలేవారండీ! ఈ మధ్య బి. ఏ. పాసయిన అమ్మాయిని మూడు వేల కట్నంతో అడగటానికి వచ్చారు-చదువూ లేదు, అందమూలేదు, వెయ్యిరూపాయలా?'

అంటూనే లేచిపోయారు వాళ్లు—

వాళ్లు అలా వెళ్లగానే మాధవిని కౌగిలించుకుని బావురుమంది శ్యామల—

'నీమాట విని చదువుకున్నా బాగుండిపోను మాధవీ!' మాధవి తన కన్నీళ్లు తుడుచుకుంటూ శ్యామలను ఓదార్చింది—

'చదువుకుంటే చాలామంచిదే అనుకో! ఇప్పుడేం చేస్తాం? విచారించకు—అయినా వంకలుపెట్టాలనే వాళ్లు ఎలాగైనా వంకలు పెడతారు—చదువుకుంటే 'ఇంత చదువుకుంది-తిన్నగా కాపురంచేస్తుందా?' అనేవాళ్లు లేరా? ఏమిటో ఈ రోజుల్లో ఆడపిల్ల పెళ్లి ఒక పెద్ద సమస్యగా తయారై కూర్చుంది—నీలాంటివాళ్లు ఎందరో.........'

'మూడువేలు! ఎక్కడ తేను?' తల రెండు చేతులతోనూ పట్టుకుని కూర్చున్నాడు శివశాస్త్రి—

'ఆయన పెన్షనూ, నీ జీతమూకూడా ఇంటికే అయిపోతోంది మాధవీ! అతి ప్రయత్నంమీద ఈ నెల ఒక వంద దాచగలిగాను-శ్యామల పెళ్లి ఎలా అవుతుందో?'

కలిమిలో లేమిలో నిండుకుండలా సంసారం సాగించిన పరమేశ్వరి బేలగా మాధవిని చూసింది—

'ఈ పూర్వాచారాలవల్లవచ్చే చిక్కులు ఇవన్నీ—హాయిగ అబ్బాయీ అమ్మాయీ ప్రేమించుకు పెళ్లిచేసుకుంటే ఏ గొడవా ఉండదు—' విసుగ్గా అంది రాధ—

పరమేశ్వరి బిత్తరపోయి చూసింది—



# అపరాజిత

'కానీ, అందులోనూ ఇంతకుమించిన సమస్యలున్నాయి రాధా! యువతీ యువకు లిద్దరూ సంస్కారులూ, వివేకవంతులూ, సహృదయులూ అయినప్పుడే. ఆ మార్గం మంచిది—అలాకాక నిగ్రహం కోల్పోయి ప్రవర్తిస్తే అన్నివిధాలా బ్రతుకు నాశన మయిపోతుంది—మొగవాడిమీద ప్రకృతి ప్రభావం లేదు—కనుక అతను తప్పు కుంటాడు—చివరకు అన్నినిందలూ అన్ని కష్టాలూ ఆడది భరించవలసివస్తుంది—?

ఎన్నివిధాలుగా ఆలోచించినా ఎలా పరి ష్కరించాలో అర్థంకాని శ్యామల పెళ్లి సమస్య అందరి గుండెల్లోనూ బండరాయై కూర్చుంది—

*   *   *

మాధవీ మధుల మధ్య చిగిర్చిన అను బంధం రోజా రోజుకీ మరింత గాఢంగా అల్లుకు పోయింది— పార్కులో కూర్చుని అర్థంలేని కబుర్లు చెప్పుకోవటం నిత్య కార్యక్రమంలో ఒక భాగమయిపోయింది— ఉన్నంట్లుండి ఒకరోజున మధు 'మాధవీ నిన్ను చూస్తుంటే నాకేమని పిస్తుందో తెలుసా?' అన్నాడు—

'మీరు చెప్తేగా!' అల్లరిగా నవ్వింది మాధవి—

'నేను యవ్వనంలో అడుగుపెట్టిన నాటినుండీ ప్రకృతి నాలో కలిగించిన పులకరింతలన్నీ ఒక్కసారి ఎదుట నిలిచి పలకరించినట్లు— సృష్టిలో మాధుర్య మంతా రూపుదాల్చి సాక్షాత్కరించినట్లు —మధుర భావనలన్నీ మైమరచి నవ్వి నట్లు......'

'అయ్యో!'

'ఏమిటి మాధవీ!'

'ఇంతాచేసి మీరు చెప్పదలచుకున్నది పిత్యంలాంటి ఈ కవిత్వమా? మనసులో మమకారముందని చెప్పటానికి ఇన్ని సాము గరిడీలు చెయ్యాలిటండీ!...'

వెక్కిరిస్తున్నట్లు నవ్వింది మాధవి—

మధు ఉడుక్కున్నాడు— ఆ కవ్వింపుకు రెచ్చిపోయి 'మమకారం మాత్రమే కాదు...' అంటూ ఆగాడు—

'మరి?...'

'చెప్పనా! థియరీ చాలా? ప్రాక్టికల్ ఎక్స్‌ప్లనేషన్ కావాలా?'

మాధవికళ్లలోకి చూస్తూ అడిగాడు—

ముఖమంతా ఎర్రబడిపోగా తలదించు కుని కొన్ని క్షణాలు మాట్లాడలేక పోయింది మాధవి — అంతలో తలెత్తి ధైర్యంగా మధుకు చూస్తూ 'రెండూ అక్కర్లేదు—ప్రామిస్ కావాలి—' అంది—

'గడుసుదానివి—' నవ్వాడు మధు—

మాధవి కుడి చేతిని అందుకుని 'నీ యిష్టం—నువ్వెప్పుడంటే అప్పుడు నిన్ను పెళ్లి చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నాను—' అన్నాడు—

మాధవి ముఖం సంతోషంతో వెలి గింది — మృదువుగా చెయ్యి విడిపించు కుంటూ 'మా శ్యామలక్కయ్యకి కావాలి ముందు—' అంది—

'సంబంధాలొస్తున్నాయిగా ఉందే! ఇంకా ఏదీ నిశ్చయం కాలేదా?'

'కుదరటంలేదు — ఇప్పట్లో కుదురు తుందనీ తోచటంలేదు—'

'అదేం? ఆవిడకేం తక్కువయిందీ?'

'తక్కువయింది అక్కయ్యకి కాదు— పెద్దనాన్నకీ పెళ్లి కొడుకులకీ—ఆయ నకి డబ్బు వీళ్లకి సంస్కారం...'

'ఓహో! కట్నం దగ్గిర కుదరటంలేదా?'

'ఊఁ! కనీసం మూడువేలైనా కావా లంటున్నారు—మరొక వెయ్యి అయినా ఖర్చులుంటాయి—నాలుగువేలు — ఎక్కడ తేవాలి?'

'శ్యామలకు చదువూ అబ్బలేదు...'

'అదోవంక!—అక్కడికి మహా చదువు కున్న వాళ్లకి కట్నం తీసుకోనట్లు!— ఎంత కష్టపడ్డా, నెలకు వంద పోగు చెయ్యగలమేమో కాని, నాలుగువేలు ఎక్కడ తేగలం?'

'మా కంపెనీలో నెలనెలా తీర్చే పద్ధతి మీద, పెళ్లిళ్లకీ— ఇళ్లు కొనుక్కోవ టానికీ—మొదలైనవాటికి అప్పులిస్తారు— మా చెల్లెలు పెళ్లికని అప్లైచేసి నాలుగువేలు అప్పుతెస్తాను—నువ్వొకవంద నేనొక రెండువందలూ కలసి నెలకు మూడువందలు కట్టేద్దాం — శ్యామలకి పెళ్లయిపోగానే మనం పెళ్లిచేసుకుందాం! అప్పుడు నీ జీతమంతా అప్పుకింద కట్టేసి నా జీతంతో ఇల్లు గడుపుకోవచ్చు— ఏం మాధవీ!'

'హమ్మయ్యో! మీరు అప్పుతీసుకోవ టమే! వద్దు—ఇందులో మిమ్మల్ని ఇరి కించటం నా కిష్టంలేదు— ఏమో! భవి ష్యత్తు ఎలా ఉంటుందో ఎవరు చెప్ప గలరు? మనం అనుకున్నవన్నీ అను కున్నట్లు జరుగుతాయని ఏముందీ?'

'మాధవీ! ప్లీజ్! అర్థంచేసుకో! నీకు దూరంగా ఉండాలంటే నాకెంత బాధగా ఉందో నీకేం తెలుసు? మీ శ్యామ లక్కయ్యకు పెళ్లయితేనేకాని, మనకు లైన్‌క్లియర్ కాదు— అందుకు ఇంత కంటే మార్గంలేదు—'

'అయినా...........'

'మాట్లాడకు మాధవీ! నిన్నాజ్ఞా పించే అధికారం నాకుంది— నువ్వు నా మాట విని తీరాలి—'

'అది కాదండీ! ఒకవేళ అప్పు తీర్చ లేకపోతే?'

'ఎందుకు తీర్చలేం? మీ అక్కయ్య పెళ్లయ్యాక, మన పెళ్లికి ఏం అభ్యం తరం ఉంటుందీ? ఇద్దరం ఉద్యోగాలు చేసుకుంటూ ఈమాత్రం అప్పు తీర్చ లేమా? నీలో నాకు అపనమ్మకంలేదు— నా సర్వస్వమూఅయిన నువ్వే నన్ను మోసం చేస్తే ఇక నా బ్రతుకు ఏమయిపోతే మాత్రం నాకేం దిగులు?'

'ఏమిటిది మధూ? నేను మిమ్మల్ని మోసంచేస్తానా?'

'మరి, భవిష్యత్తు ఎలా ఉంటుందో' అని ఎందుకన్నావ్? ఎన్నిచికాకులొచ్చినా, ఏ ఇబ్బందులొచ్చినా మనకుమాత్రం ఎడ బాటు ఉండదు మాధవీ! నేను అప్పు తీసుకుంటాను—ముందు శ్యామల పెళ్లి అయిపోనీ!'

'మీ ఇష్టం!'

'గుడ్! మాధవీ!'

ఆ తర్వాత పదిరోజులు దాటకుండానే మాధవి చేతులో నాలుగువేలు పెట్టాడు మధు—అందుకొంటూంటే మాధవి చేతులు వణికాయి — కళ్లలో నీళ్లు తిరిగాయి —

'ఇంత త్యాగానికి అర్హురాలినా నేను?'

'పెద్దమాటలు వాడకు—త్యాగం లేదు— నా తలకాయాలేదు— ముందు మీ శ్యామ లక్కయ్యకు పెళ్లయిపోయే మార్గం చూడు—'

ఇంకా అక్కడ నిల్చుంటే మాధవి ఏం పొగుడుతుందోనని వెంటనే వెళ్లి పోయాడు మధు—

ప్రేమా, గౌరవమూ, ఆరాధనా పెన వేసుకున్న చూపులతో వెళ్లిపోతున్న అతణ్ణిచూస్తూ నిలబడిపోయింది మాధవి—

(ఇంకా వుంది)


CINTHOL
ఎక్కువ
సువాసన
ఎక్కువ
మెత్తదనము
మెత్తనిది. పూవువలె తాజాయైనది. సువాసనగలది
సాటిలేని క్రిమి సంహారి జి-11 గల
సింథాల్ టాయిలెట్ పౌడరు చాల సేపు నిలిచే
సువాసన మరియు పట్టువంటి మెత్తదనముతో
మీ చర్మమునకు అంటుకొని ఉండి,
మీకు రోజంతా రక్షణ కలిగిస్తుంది.
CINTHOL
జి-11 గల
సింథాల్ మీకు
రక్షణ యిచ్చినట్లు
వేరే ఏ
పౌడరూ
యివ్వలేదు.

# మూడుచక్రాల సైకిల్

ముదిగొండ వీరభద్రయ్య



సుధాకరం సుజాతా బస్సులో మౌనంగా కూర్చున్నారు. సుజాత కిటికీ లోంచి బైటకెటో చూస్తోంది. సుధాకరం తలదించుకొని తన అంతరంగంలోకి చూసుకొంటున్నట్లున్నది. బైటినుంచి చలిగాలి రివ్వున వస్తోంది. సుజాత షాల్‌ని చెవులమీదిగా కప్పుకొంది. బస్సులో అంతగా జనం లేరు. బస్సు ధ్వనీ, అప్పుడప్పుడు ఆ బస్సుని అధిగమించి వెళ్తున్న కారు హారన్ల చప్పుడూ తప్ప వాళ్లిద్దరి ఆలోచనల్ని ఆపేది మరేదీ అక్కడ లేదు.

అనుకోకుండా సుధాకరం తల ఎత్తాడు. అదే సమయానికి సుజాతకూడా తలఎత్తింది. ఇద్దరి చూపులూ ఒకేచోట నిల్చినవి— ఒక అమ్మాయిగా, ఒక అబ్బాయిగా, తల్లీ తండ్రీ; నలుగురి ముఖాలూ వికసించి వున్నవి — అదో ప్రకటన — దానికింద ఆ బొమ్మలో లాగుంటే ఎలా సుఖపడొచ్చో ఒక నినాదం వుంది! అసలు ప్రకటనల రహస్యమే అది! జీవితంలో మనం సాధించలేని దానిని సాధించగలమేమో అన్న విశ్వాసాన్ని కల్గించేదే ప్రకటన. కాని మానవుడి ఆశలెలా ఘనీభవించి జీవితంలో ఏనాడూ సుఖాన్నెలా ఇవ్వలేవో అలాగే ప్రకటనలున్నూ!

అందరిలాగే సుధాకరమూ తన జీవితంలో నవ్వులు నింపుకుందా మనుకొన్నాడు. నిజానికి కొంతకాలం అతని జీవితంలో నవ్వులు విరిసినవికూడా! కాని...ఆ ఒక్క సంఘటన అతణ్ణి దుఃఖ వైతరణిలోకి పడదోసింది. పంటల్ని పండించే వానతోబాటే పిడుగూ పడ్తుంది. కాని అది చెప్పి పడ్తుందా? పిడుగు పడ్తుందని వానలు కురవ వద్దంటారా కర్షకులు...

* * *

సుజాత ఆనాడు కాలేజీనుంచి తిరిగి రాగానే ఇంటిల్లిపాదీ శోకాలు పెడ్తుండం చూసి ఏదో కీడు శంకించింది. చుట్టుపక్కలవాళ్లు వచ్చి సుజాత తల్లిని ఓదారుస్తున్నారు. ఎవరో అసలు విషయం సుజాత చెవిలో వేశారు. సుజాత కుప్పలా కూలిపోయింది. ఆ రాత్రి సుధాకరము తన భార్యా పిల్లల శవాలతో టాక్సీలో వచ్చాడు.

ఎన్నో మరణాల్ని వీధుల్లో చూస్తుంటాము. ప్రతి మరణానికీ 'అయ్యో పాపం!' అని సానుభూతి చూపుతుంటాము. కాని ఆ మరణమే మన వాళ్లకి ప్రాప్తించినప్పుడు ఆ సానుభూతిని మనమే ఆశిస్తాము. మన దుఃఖం గుండెల్లోంచి చిమ్ముకొని వస్తుంది. కాని ఎవడి సానుభూతి ప్రదర్శనా దాన్ని ఆపలేదు. ఒక్క కాలమే ఆ దుఃఖోద్వేగాన్ని ఆపగలదు. కాని సుధాకరం మీద ఆ కాలంకూడా పని చేయలేకపోయింది. అతననుక్షణం పిచ్చివాడిలా కాకుంటె విరాగిలా ప్రవర్తిస్తున్నాడు.

'సుశీ! చిట్టి ఏడుస్తోంది. కాస్త సముదాయించవూ!'

'సుశీ! బుజ్జిగాడు రేజర్ సెట్ తీస్తున్నాడు. కాస్త దాన్ని తీసి అలమారలో పెట్టవూ!'

— ఇదీ అతని మాటలతీరు. అతనింకా వర్తమానంలోకి పడలేదు. అవును మరి! రమణీయమైన భూతకాలమున్నవాడు

చూస్తూ చూస్తూ శోకసర్ప పరివేష్టిత మైన వర్తమానంలో ఎలా బ్రతక గలడు?

కాని అతణ్ణి మళ్ళీ వర్తమానంలోకి లాక్కుని వచ్చిందొక వ్యక్తి! ఇక్కడినుంచే ఈ కథ ప్రారంభం.

'బావా ఉద్యోగానికి ఎన్నాళ్ళు సెలవు పెట్టావు?'

'ఈ జీవితానికే సెలవు పెడ్దామను కొంటున్నాను సుజాతా! ఇంక ఉద్యోగం ప్రసక్తి ఎక్కడ?' పీక్కుపోయిన కళ్ళల్లో రెండు కన్నీటి బిందువులు నిల్చినవి.

'బావా! సెలవు మంజూరు చేయడానికి ఆఫీసులో ఒక అధికారి అంటూ వుంటాడు. కాని ఈ జీవితంనుంచి సెలవు తీసికోడానికి ఏ అధికారికి సెలవు చిట్టీ పంపుతావు.'

'భగవంతుడికి!' అతని కళ్ళల్లోని బిందువులు జారిపోయినవి.

'ఆయన లేడు బావా! ఉన్నది మనమే. అడవుల్లో పుట్టిన మానవుడు నగరాలు నిర్మించుకొంటున్నాడు. అనుక్షణం దుఃఖమయమైన తన జీవితాన్ని సుఖమయం కావించుకోడానికి విశ్వప్రయత్నం చేసికొంటున్నాడు. అంతేగాని దుఃఖభరితమైన ఈ జీవితాన్ని లాగలేక జీవితంనుంచి తొలి మానవులే పారిపోయి ఉంటే మనమిలా పుట్టి వుండేవాళ్ళమా?' అతని చెక్కిళ్ళు తుడుస్తూ అన్నది సుజాత.

ఇంకోరోజు సుజాత అతన్ని మళ్ళీ ప్రపంచంలోకి లాగింది.

'బావా! నా బి. ఏ. అయింది. మీ వూర్లో ఎం. ఏ. వుందికదా! అక్కడ మీ ఇంట్లో వుండి చదువుకొంటాను.'

'తిరిగి నేనా ఇంటికి వెళ్ళలేను సుజాతా!'

'ఏం ఫరవాలేదు బావా! జీవించడానికి కూడా కాస్త సాహసం కావాలి. మనం సాహసం చూపే వరకూ మనల్ని ఆ జీవితం దగ్గరకు రానీయదు.'

కొన్నాళ్ళకి సుజాత సుధాకరాన్ని తీసికొని హైదరాబాద్ చేరింది. వాళ్ళ ఇంట్లోనే వుండి సాంఘిక శాస్త్రంలో ఎం. ఏ. చేస్తోంది. సుధాకరం రోజూ ఆఫీసుకి వెళుతున్నాడు. రోజూ ఆఫీసు నుంచి తిరిగి రాగానే పడక గదిలోకి చేరి తన గతించిన భార్య చిత్రపటంచూస్తూ కూర్చుంటూ డతను. అదే అతనికి తన దైనందిన కార్యక్రమంలో సంతోషాన్నిచ్చే ఏకైక ఘట్టం!

సుజాత అతనికి రోజూ వండి పెడుతూ అతనికి ఏ లోటూ రానీయకుండా చూసి కొంటోంది.

'బావా! భోజనానికి రా. అన్నం చల్లారిపోతోంది.'

'ఇవేళ భోజనం చేయను సుజాతా!'

సుజాత అతని గదిలోకి వచ్చింది. అతను తన భార్య చిత్రపటాన్ని చూస్తూ కన్నీరు కారుస్తున్నాడు.

'ఏం పని బావా అది — ఆడపిల్ల లాగా!'

'ఆడవాళ్ళకి మాత్రమే కన్నీరు కార్చే హక్కుంటే నేనూ స్త్రీగా మారిపోతాను. ఈ అశ్రుతర్పణంలో వుండే సుఖం జీవితంలో మరి దేన్లోనూ లేదు' అన్నా డతను.

సుజాత భారం దిగిపోయినట్లుగా శ్వాస విడిచి అన్నది—

'అదే బావా! నేనూ అనాలనుకొంటున్నది. మానవుడెప్పుడూ సుఖాన్వేషి! అతని గుండె ఎప్పుడూ మృత్యువులో దివ్యత్వాన్నీ, ద్వేషంలో ప్రేమనీ, దుఃఖంలో సుఖాన్నీ అన్వేషిస్తూంటుంది. కాని అదంతా కాల్పనిక జగత్తు బావా! దానిలో సుఖం లేదనడంలేదు నేను. కాని అది మిథ్యాసుఖం. ఈ శరీరానికి సంబంధం లేని సుఖం అది. శరీరంతో సంబంధంలేని సుఖం ఎక్కువకాలం ఈ శరీరాన్ని నిలపదు.'

'ఐతే ఇంకా మంచిదేకదా.'

సుజాత కళ్ళల్లోనుంచి నీళ్ళు కారినవి.

సుధాకరం వెంటనే లేచి,

'అదేమిటి సుజాతా! అలా ఏడుస్తున్నావ్?' ఆదుర్దాగా అడిగాడు.

'సంవత్సరంపాటు నీ కన్నీళ్ళని నేను సహించగల్గానుకాని నా కళ్ళల్లోంచి జారిన ఒక్క కన్నీటిబిందువుకే నువ్విలా బాధపడుతున్నావ్ చూశావా బావా!'

'అవును సుజాతా! అవతలివాళ్ళ దుఃఖాన్ని నేను చూస్తూ ఊరుకోలేను.'

'బావా? ఇలా చూడు నన్ను. నీ బాధకి నా గుండెలనిండా కన్నీరు నిండివుంది. కాని ఇవేళ తొలిసారిగా — అది నా ప్రమేయం లేకుండా — జారిపోయింది. అందు కెంతో బాధగావుంది నాకు.'

'బాధా? ఎందుకు సుజాతా?'

'నాకు కూడా చేతకానితనం అవన్న వౌతున్నందుకు' ఆ మాట అని సుజాత లోపలికి వెళ్ళిపోయింది. ఆ మాటతో సుధాకరం చాలారోజులతర్వాత లౌకిక జగత్తులో పడ్డాడు. తన కన్నీటికి, తన శోకానికి తానే విచారించాడు. అతను వెంటనే గదిలో అటూ ఇటూ తిరిగాడు. ఒకమూలన చక్రాలు విరిగిపడిన మూడు చక్రాల సైకిలుబండి కనబడింది. అతనక్కడికి వెళ్ళి ఒక చక్రాన్ని దాని కెక్కించి స్క్రూలు తిప్పుతున్నాడు.

అంతలో సుజాత మళ్ళీ వచ్చింది.

'ఆ చక్రాన్ని నేనెక్కిస్తాగాని నువ్వు వచ్చి భోజనం చెయ్యి బావా!' అన్నదామె నవ్వుతూ.

అతను లేచి ఆమె కళ్ళల్లోకి చూస్తూ ఆమెని సమీపించాడు.

'ఏం బావా! అలా చూస్తున్నావ్?' సంతోషంగా అన్నదామె.

'ఏంలేదు సుజాతా! ఈ సైకిల్‌కి ఒక్క చక్రమే ఎక్కుతుంది. తక్కిన రెండు ఎప్పుడూ ఎక్కవు!' అతను గబగబా వంటగదిలోకి వెళ్ళి భోజనంమీద కూర్చున్నాడు. అతనిభోజనం సగమయ్యాక ఆమె వచ్చింది.

'నువ్వూ భోంచేయి సుజాతా!'

'అలాగే బావా!'

ఇద్దరూ కలసి భోజనం చేశారు.......

'సుజాతా! విరిగిపోయిన నా జీవన ఖండాల్ని అతికించబోయి నీ జీవితాన్నే విరుగ కొట్టుకొంటున్నావేమో'

'కాదు బావా! జీవితం ఎన్నడూవిరగదు. అది ఆగుతుంది తప్ప. నా జీవితం ఆగిపోయేటంతవరకు మన బంధాన్నిలాగే కాపాడు బావా!' ఆమె చెక్కిళ్ళమీదనుంచి జలజలా కన్నీరు కారింది.

'పిచ్చి సుజాతా! ఎందుకూ ఏడుస్తున్నావ్? ఏడవ్వాకు.'

అప్పటినుంచి సుజాత నవ్వుతూనే వుంది. ఆమెకి ఏలోటూ కలగలేదు. ఆమె కాలేజీలో లెక్చరరయ్యింది సుధాకరంతోపాటు అన్నీ సమకూరినవి ఆమెకి—

# మూడుచక్రాల సైకిల్

ఒక్కటి తప్పు!

సుధాకరమూ ఆమెతో బాటు నవ్వుతూనే బ్రతుకుతున్నాడు. సుధాకరానికి అందమైన భార్య లభించింది. తన జీవన వృక్షానికి కొత్త చిగుళ్ళు వేయించగల్గిన వసంత రాణి లభించింది తనకి! కాని...కాని...ఆమెకు తాను అన్నీ లభింప జేస్తున్నాడా? తొందర పడ్డాడు తాను. తన దుఃఖంతో ఒక అమాయకురాలిని తనవైపుకి ఆకర్షించు కొన్నాడు! ఛీ! ఛీ! ఒక పసి పిల్ల హృదయంలో తానెంతటి చిచ్చు పెడుతున్నాడు!

* * *

అవతల వాన లంకించుకొంది. ఇద్దరూ బస్సుదిగే సమయానికింకా వాన నిలవలేదు. బస్సుదిగి వానలో తడుస్తూ గబగబా వాళ్ళు ఇంటికి చేరుకున్నారు. సుజాత సుధాకరం తల తువ్వాలతో తుడిచింది. ఇద్దరూ కలిసి భోజనం చేశారు.

'ఏమిటి సుజాతా ఇవ్వాళ నువ్వదోలా వున్నావ్!'

'ఏం లేదు బావా!' సుజాత మౌనంగా అతని కౌగిలిలో ఇమిడిపోతూ అన్నది.

'ఏం లేకపోవడ మేమిటి? ఏదో వుండే వుంటుంది. అది నాకు చెప్పగూడనిదైతే చెప్పనక్కర్లేదులే సుజా!'

తల పైకెత్తి చూసింది సుజాత. చిబుకం మీది ఆకుపచ్చని రంగుపై తన చూపుడు వ్రేలిని త్రిప్పుతూ అన్నదామె.

'జీవితంలో రహస్యానికి స్థానం వుందా బావా?'

ఆ ప్రశ్నతో సుధాకరం గిలగిలలాడిపోయాడు. సూటిగా ఆ ప్రశ్న అతని గుండెల్లోకి వెళ్ళిపోయింది. కొంపదీసి తమ డాక్టరా రహస్యాన్ని సుజాతకి చెప్పలేదుగదా! హే భగవాన్ నన్నీ ప్రమాదం లోంచి రక్షించవూ!

'ఏం బావా! సమాధానం చెప్పవూ!'

'సుజా! ఎందుకడుగుతున్నావీ ప్రశ్న?'

'ఊరికేనే తెలిసికొందామని.'

'రహస్యమే నాగరకత—బట్టబయలే అనాగరకత.'

'కాని బావా! అవతలివాళ్ళ జీవితాన్ని నమిలి మింగేయగల విషయం రహస్యంలో దాగిపోతేనో...'

ప్రభంజనానికి వణికిపోయే మొక్కలా సుధాకరం గుండె వణికిపోయింది.

'కాని అవతల వాళ్ళకి కాస్త క్షమా హృదయం వుంటే ఎంత పెద్దదెబ్బనైనా తట్టుకోవచ్చేమో సుజాతా!'

'అవును బావా! సమాజంలో క్షమ అనే వస్తువు లేకపోతే సమాజమంతా రుద్రభూమిలో నివాసం చేసివుండేది!'

మర్నాడు సుధాకరం ఆఫీసునుంచి ఇంటికి తిరిగి వచ్చేటంతవరకూ అదే విషయాన్ని ఆలోచిస్తున్నాడు. సుజాతకి తానా విషయం రహస్యంగావుంచి పెద్ద పొరపాటు చేశాడు. ఆమె తనని వివాహం చేసికోవడానికి ఉద్దేశించి నప్పుడు అప్పటి తన ఆ వైరాగ్యంలో కూడా బోలెడు స్వార్థం వుందన్నమాట! ఛీ! ఛీ! తానెంత దుర్మార్గుడు! కేవలం ఈ లౌకిక సుఖం కోసం శాశ్వతంగా ఒక అమాయకురాలి జీవితాన్ని దగ్ధం చేశాడు! తన పాపానికి ప్రాయశ్చిత్తం వుందా? తనని భగవంతుడు క్షమిస్తాడా? అయినా ఒక్క తన సుజాత క్షమిస్తే భగవంతుడు క్షమించక పోయినా ఫరవా లేదు.

ఎదురుగా అతణ్ని వెక్కిరిస్తూ మళ్ళీ ఆ ప్రకటన ఇద్దరూ లేక ముగ్గురు చాలు! ఆ నలుగురి నవ్వుల్లో ఎంత ఆకర్షణ! వాళ్ళలా నవ్వబోయి తన బ్రదుకు బండలై పోయింది! తన మూర్ఖానికి మళ్ళీ పెళ్ళి చేసికొన్నాడు! ఛీ ఛీ! ఎంతటి నేరం చేశాడు తాను.

సుధాకరం ఇంటికి వచ్చేటప్పటికి ఇంట్లో ఎవరో పురుషుడి కంఠం వినబడ్తోంది. అతని రాకతో ఉద్రేకంగా మాట్లాడుతున్న వాళ్ళిద్దరి మాటలూ ఆగిపోయినవి. ఆ కొత్త వ్యక్తి సుధాకరాన్ని చూసి గబగబా బైటికి వెళ్ళిపోయాడు.

'సుజాతా! ఎవరతను?'

'బి. ఏ. లో నా క్లాస్‌మేట్!' తల నేలకి దించుకూ అన్నదామె

మౌనంగా ఇద్దరూ కాఫీ త్రాగారు. సుధాకరం ఆలోచనల్లో పడిపోయాడు. సుజాత పని ముగించుకొని వచ్చింది.

'బావా! ఒక విషయం సూటిగా అడుగుతాను సమాధానం చెప్తావా?'

'అడుగు సుజా!'

'నేనేదైనా తప్పు చేస్తే నువ్వు క్షమించగలవా బావా?'

'క్షమ — ద్వేషం — కోపం అనేవి మనకి తెలిసి రావు సుజాతా! అవి ఒక్కొక్కడి రక్తంలో జీర్ణించివుంటవి. ఇంతెందుకు? నేనే నిన్నో ప్రశ్న అడుగుతాను చెప్పు! మారుతున్న వ్యవస్థలో మార్పుకి నూటికి తొంభైమంది ఒప్పుకోరు, ఎందువల్ల?'

'ప్రాచీన వ్యవస్థమీది అనురాగాన్ని త్రెంపుకోలేక!'

'దాన్నే నా మాటల్లో చెప్పాలంటే ప్రాచీన భావాలమీద విప్లవం చేసినవాడి మీద వాళ్ళకి కోపం వచ్చి వాడు చెప్పిన మాట వినకపోవడం వల్ల! కాని వాడు చూపిన విప్లవం జీవితానికి అవసరమైనదని తెలిసినవాడు తప్పక వాడిమీద, వాడి భావాలమీద కోపాన్ని చంపుకొని వాణ్ని అనుసరించి సుఖిస్తారు.'

'అంటే అనురాగానికి ప్రేమకీకూడా ఒక ప్రయోజనం, ఒక అవసరం ఉంటవంటావు.'

'అవును సుజా! ప్రయోజన రహితమైన గుడ్డి ప్రేమమీద నాకు నమ్మకం పోయింది.'

సుజాత ఆ మాటలకి చిరునవ్వు నవ్వింది.

'నాకు తెలును నువ్వెందుకు నవ్వుతున్నావో సుజా! కాల్పనిక జగత్తులోనో, భూతకాలపు మధుర స్మృతుల్లోనో బతికిన ఈ బావేనా ఇవేళ ఇంతటి లౌకికుడైంది!' అని కదూ.

'లౌకికుడు కాదు బావా! సాంఘికుడు బావా! నీలో చాలా మార్పు వచ్చింది, సాంఘిక అవసరాలు — అవి తీర్చుకునే అవకాశాల్నిబట్టే ఈ జీవితనౌక తనదారిని ఎన్నుకొంటుంది. అది చేతకానివాడే కాల్పనిక జగత్తులోకో, భూతకాలానుభవాల్లోకో జారిపోతాడు.'

'అలాంటివాడు చచ్చినవాడితో సమానం సుజాతా!

'బావా! ఇవేళే మనిద్దరం నిజంగా దంపతులమైనది.'

అతణ్ని సుజాత గట్టిగా కౌగిలించుకొంది.

'బావా! ఏం జరిగినా ఈ బంధాన్ని త్రెంచవు కదూ!'

'అదే ప్రశ్న నేనూ నిన్ను వేద్దామనుకొంటున్నాను సుజా!'

గడియారం జీరో అవర్‌లోకి వచ్చింది!

కొత్త జీవితం ప్రారంభమైంది.

నాలుగురోజుల తర్వాత సుధాకరానికి ఆఫీసు అడ్రెస్‌కి ఒక రిజిష్టర్ కవర్ వచ్చింది.

సుధాకరం దాన్ని విప్పి చదివాడు.

'డియర్ సుధాకర్!

ఈ ఉత్తరం నీకు వ్రాసి బాధపెడ్తున్నానని నాకు తెలుసును. కాని వ్రాయక తప్పడం లేదు. నన్ను బాధించినవ్యక్తి జీవితాన్ని ఇంత మధురంగా, ఇంత అమృతమయంగా నేను వుంచలేను! నాకది చేతకాని విషయం. ద్వేషంతోటే ఆవ్యక్తిమీద కసి తీర్చుకుంటాను. డియర్ సుధాకర్! ఇవేళ్టి నీ రెండో భార్య ఒకప్పుడు నా ప్రేయసి. ఈ మాటలు నువ్వు నమ్మవని నాకు తెలుసును. అందుకే ఆమె చదువుకొంటున్న రోజుల్లో నాకు వ్రాసిన ప్రేమలేఖ ఒకటి దీనోటి పంపుతున్నాను. ఇది చింపేసి కులాసాగా బ్రదుకుదామనుకొంటున్నావేమో! ఇలాంటి వుత్తరాలో పది వాడగ్గర వున్నవి. నువ్వు ఆమెని వదిలేయకపోతే మీ ఇద్దరి బ్రదుకులు బండలు చేస్తాను.

ఇట్లు

నీ హితైషి.'

సుధాకరం ఆ వుత్తరం జాగ్రత్తగా మడిచి జేబులో పెట్టుకొన్నాడు. జరుగబోయే పరిణామాన్ని తలచుకొని అతని గుండె గుబగుబలాడిపోయింది. తనకి ఈ ఒక్కఅవకాశం వచ్చింది—చేసినతప్పు సరిదిద్దుకోవడానికి!

సుధాకరం సాయంత్రం ఆలస్యంగా ఇంటికి వెళ్ళాడు.

'బావా! ఇవేళ ఆలస్యంగా వచ్చావేం'

'అవును సుజాతా!' అతని కంఠం వణకుతోంది. సుజాత అతణ్ని పరిశీలిస్తోంది. ఇవేళ అతనిముఖం రోజటిలాగా లేదు.

'సుజా! ఇవేళ నాకో వుత్తరం వచ్చింది.'

సుజాత గుండెల్లో బాంబు పడింది. ఆమె రక్తం అమితవేగంతో పరుగెత్తింది. కళ్ళుతిరిగి ఆమె పడిపోయింది—సుధాకరం ఆమెని పట్టుకొని,

'ఎందుకు సుజా! ఏమన్నానని అలా వాలిపోయావు?'

'ఆ వుత్తరం...ఆ వుత్త...రం...'

'అవును ఆ వుత్తరం అతని దగ్గర నుంచే వచ్చింది.'

'మరి?'



## మూడుచక్రాల సైకిల్

'మరేమిటి పిచ్చిసుజాతా!'

'మరేమీ లేదా?'

'మరేమీ లేదు సుజా! నువ్వీ మొండి జీవితం నాదగ్గర గడుపదల్చుకొన్నన్ని రోజులు మరేమీ వుండదు—అని అభయ మిస్తున్నాను సుజాతా!'

'అంతటి క్షమ నాకు భారవహౌతుంది బావా!' అతని గుండెలమీద వాలి వెక్కుతూ అన్నది సుజాత.

'నా క్షమ కాదు నీకు భారమయ్యేది...'

'తక్కినది నాకు చెప్పకు బావా! అది నాకు తెలుసు.'

'తెలుసా?' ఆశ్చర్యంగా అడిగాడు సుధాకరం.

నవ్వుతూ సుజాత మూడు చక్రాల సైకిల్ వైపు చూపించింది. దానికి ఒక చక్రం బిగించబడి వుంది. తక్కిన రెండు చక్రాలూ లేవు!

'ఇంక ఆ రెండు చక్రాల్లాంటి పిల్లలు మనకి వుండరంటావు బావా!' సుజాత శిరస్సుమీద రెండు చేతులో త్రాసూ.

'అవును సుజా! జీవితంలో సుఖాన్ని పొందుదామని మీ అక్కని కష్టపెట్ట కూడదని శాశ్వతంగా నేనే నివారించు కొన్నాను, ఈ జన్మకి మన ప్రతిబింబాలు అద్దంలో తప్ప మరెక్కడా కన్పించవు సుజాతా!'

'బావా! ఇంత పసిమనస్సు వున్న నువ్వేనా కొడుకువి! ఇంత క్షమా హృదయమున్న నీవే నాతల్లివీ దండ్రివీ! ఇంతటి నురాగ హృదయమున్న నువ్వే నాభర్తవి!'

సుజాతని సుధాకరం నెమ్మదిగా ముద్దు పెట్టుకొన్నాడు.

'ఒక్క ప్రశ్న అడుగుతాను తప్పక సమాధానం చెప్తావా సుజా!'

'తప్పకుండా చెప్తాను బావా!'

'ఐతే నువ్వతనిన్నే ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?'

'ద్వేషంతో అతను హృదయాల్ని చంపగలడే కాని నీవలె క్షమతో బ్రతికించలేదు బావా! అందుకని.'

గడియారంలో రెండు ముళ్ళూ కలిసి జీవన సంగీతం పాడినవి! ●

# ఇలా రండొక సారి!



కె. రామలక్ష్మి

ఒకాయన బొట్టు పెట్టుకోవడం పెట్టుకోకపోవడం గురించి రాస్తూ, మాంత్రికులూ తాంత్రికులూ బొట్టును హిప్నొటైజ్ చేయడానికి సాధనంగా వాడతారన్నారు. అంటే మాంత్రికుడూ తాంత్రికుడూ గారు మనబొట్టు కేస్తే చూస్తూ, మనల్ని మంత్ర ముగ్ధలను చేసి తను చెప్పినట్టు వినేలా చేస్తాడన్న మాట! ఈ మాట అన్నప్పుడు నాకో బ్రహ్మాండమైన అయిడియా వచ్చింది. ఒకరి కష్టసుఖాలు మరొకరికి పూర్తిగా అవగాహన అయేలా చేయడానికి 'ముగ్ధ'లను చేసే మంత్రవిద్య ఉపయోగిస్తే ఎలా ఉంటుందీ? అనిపించింది. 'అవునవును. ఉట్టినే సాధించిపోసే ఆడవాళ్లకి సాధింపు పడేవారి బాధ ఎలా ఉంటుందో తెలుస్తుంది.' అన్నాడు మామయ్య. 'అంతేనే అమ్మాయి. అది తెలిస్తే సాధించడం మానేస్తారు' అంటాడు. నిజమే. ఆడది సాధిస్తే మగవాడెంతటి కోతకి గురి అవుతున్నాడో అర్థం చేసుకోవచ్చు. అలాగే మగవారికో 'ముగ్ధ' మాత్ర యిప్పిస్తే? ఆడదాని కష్టనిష్ఠూరాలు అర్థం అవక పోతాయా?' అంటే అత్తయ్య నవ్వేసి ఊరుకుంది. అవును. ఆడదానిగా ఫీలయితే ఎలా ఉంటుంది? భార్యగా ఊహించుకుంటే అతగాడెలా ఉంటాడు?— అంటే 'మరుక్షణం శంకరగిరి మాన్యాలు పట్టిపోతా' రంది అత్తయ్య. 'అవునే. మగవాడిమీద పిల్లల్నికనే బాధ్యత ఉండివుంటే ఎప్పుడో మానవసృష్టి అంతమైపోయేది' అంటుంది పెద్ద వేదాంతిలాగా. వారికది వచ్చనిపని అని మనకి తెలుసు. వారికీ తెలుసు. కాని మనస్సులో ఏమూలో కొంత అంతరాత్మ పీడించి—మననా బాధలకి గురిచేసి నందుకు—మనకది భరింప కల్గిన బాధ అనీ, మన కదంత విపరీతం కాదనీ ఊహించుకుని ఊరుకుంటారు. విక్టోరియా రాణికి సహితం యిలాంటి బాధ తప్పలేదుట — ఆల్బర్ట్ గారికి భార్య గారి గర్భం అన్నా పురుళ్లన్నా అసలు లెక్క ఉండేది కాదట—దాంతో ఆమెకూ అవంటే అసహ్యం పుట్టేదట—తన భర్తకేమాత్రం ఈ విషయంలో సింపతీ లేనందుకు అది మరీ ఎక్కువయ్యేదిట. ఆల్బర్ట్ లాగే భర్తలు భార్యల ప్రసూతి విషయంలో—'ఆఁ ఆడవారి పనది' అంటూ తోసి రాజనేస్తే ... వారందరినీ కూడా ఓ సారి మంత్రించో తంత్రించో ప్రసూతి వేదన ఊహింప చేయాలంటాను. అప్పుడిక, పురుడు అంయా అవగానే—ఓసారి పిల్లవేపూ ఓ సారి అలసిన భార్యవేపూ చూపు పారేసి ... ఆమెగారిలా హాయిగా మంచంలో పడిఉంటే యింట్లో — ఎంతెంత యిబ్బందిగా ఉందో లెక్చర్లివ్వడం తగ్గిస్తారు!

అంతేకాదు. ఇంటి కర్చులకి చాలీ చాలని డబ్బిచ్చి, రోజూ పంచభక్ష్య పరమాన్నాలు వండి వడ్డించడంలేదని సణిగే వారి కోసారి తెలిసివస్తుంది — 'డబ్బులేవంటే' అని చెప్పి చెప్పకుండా వేయిరెటికప్పు లేవకొట్టేస్తారు కొరెదేదు. సరిపడని డబ్బుతో సంసారం ఈదుకు రావడం ఎంత కష్టమో, దానికి ఎంత సింపతీ చూపాలో తెలియాలంటే మగవారు కొన్నాళ్ళు బజారుపనులు చేస్తూ — యింటికి కావలసినవి కొనుక్కురావాలి. వో పది రూపాయలు పారేసి చాలదా? అనే వారికి వాటి మార్కెట్ విలువ తెలిసి వస్తుంది...అలా చేస్తే నెలకి కావలసిన డబ్బు అంతా నెల మొదటి రెండు రోజుల్లోనే అయిపోతుంది! (కొందరు మగవారు కర్చుపెట్టమని ఆడదానిచేతికి కానీ కూడా యివ్వరమకోండి. అది వేరే విషయం.)

భర్తగారి కష్టాలు—పేకాటలో హోరీపోవడం, రోజూ ప్రయాణాలు అలాటిల్లాంటివి భార్య సహృదయంతో అర్థం చేసుకోవాలంటే, రోజులోని ఏ ఇరవై గంటలో యింట్లో గొడ్డుచాకిరీ చేస్తూ పిల్లల పెంపకానికే అంకితమైపోయిన జీవిలోని నిస్పృహ నిరాశలు మగవాడు కూడా అర్థం చేసుకోవాలి. అప్పుడే గృహిణులు ఎప్పుడూ పిల్లలూ, ఇల్లూ, వంటా వార్పూ చీరలూ నగలూ గురించే ఎందుకు మాట్లాడుతారన్నది సులభంగా అర్థం అవుతుంది. నేరారోపణ చేయడం కాదది. పిల్లల ముద్దుముచ్చట్లు చూస్తూ, వారి పెంపుదలే లోకంగా మా సర్వసక్తులనీ ధారపోయడంలో ఆనందిస్తున్నాం — కాని భర్తలుకూడా అలా ఆనందిస్తే ఈ ఆడదాని ఆనందం వెనుక ఆవేదన నిరాశ తలెత్తవు ... 'తీసుకురావే ఆ మంత్రగాణ్ణి' అంటోంది అత్తయ్య. ఎందుకూ? అంటే — తలనొప్పి జ్వరం ఉన్నా తిరక్క తప్పకపోతే ఎలా ఉంటుంది? ఎంతచేసినా ముంగిలాగా, నాలి ముచ్చులాగా ఊరుకుంటే ఎలా ఉంటుంది? పిల్లల ఏడుపులతో రాత్రి మూడునాలుగు సార్లు లేవక తప్పక మళ్లీ తెల్లారుజామున లేవక తప్పకపోతే ఎలా ఉంటుంది? ... వో సారి అడిగిస్తాము అంటూంది అత్తయ్య — హిప్నొటిజమ్ అంటే అదోరకం సోదిగా ఊహించేసి ... 'ఎందుకొచ్చింది. మీ కష్టాలు పూర్తిగా తెలిస్తే మీకే నష్టం' అంటున్నాడు మామయ్య!




బేతాళుడు మరొక కథ ప్రారంభించాడు—

'ఓ రాజా విను. నీవు నా అశేష సంశయాలను పోగొట్టే దేవదేవుడయ్యావు. అందువల్ల నీవంటే నాకు చాల ఇష్టం ఏర్పడింది. మరొక కథ చెబుతాను విను.'

అంగదేశంలో యశఃకేతువు అనే రాజా ఉండేవాడు. ఆయన చాలా కీర్తిమంతుడు. ఆయన కీర్తి అనే విశ్వవ్యాప్త కమలానికి భూమిని మోస్తున్న ఫణినాయకుడు తూడులాగ అందం తెచ్చాడు. కిన్నర కాంతలు ఆయన పరాక్రమగీతాలు పాడేవారు. స్వరకంపనాలతో వారు గీతాలు పాడుతూంటే వారి కదలికలకు వారి ఆభరణాలు కదలి శబ్దించి, ఆ ధ్వని గీతాలకు యతిస్థానాలుగా విరామ స్థానాలుగా అయ్యేవి. ఆయన పరాక్రమం లంకను అవలోడించింది. దానివల్ల వృద్ధ రజనీచరులు, లంకను రామదాసులు అవలోడించింది కళ్లార చూచినవారు ఆయన పరాక్రమగాథను రామచరితంలాగ అనుకునేవారు.

అతని మంత్రిపేరు దీర్ఘదర్శి. సార్థక నామధేయుడు. అతని మంత్రాంగంవల్ల శత్రుసర్పాలు తల ఎత్తలేక పోయేవి.

యశఃకేతువు పృథివీ భారాన్ని ఆ మంత్రిపై పెట్టి నక్షత్ర రాజ శ్యామతో (రాత్రితో) గడిపినట్టు శ్యామ అనే సుందరితో గడిపేవాడు. రాజా ఇలా స్మరరసాసక్తుడై వుంటుండగా దీర్ఘదర్శి నిరంతరం జాగరూకుడై కోశదుర్గ బలాలను పటిష్ఠం చేయడంలో వ్యగ్రుడయ్యాడు.

ఇలా వున్నందువల్ల 'దీర్ఘదర్శే రాజ్యలక్ష్మిని అనుభవిస్తున్నాడు. రాజు నామమాత్రమే' అని జనప్రవాదం పుట్టింది. అది మంత్రివర్యునిచెవి తాకింది. దానికి మంత్రి చాల చింతాక్రాంతుడయ్యాడు.

దీర్ఘదర్శి భార్యపేరు మేధావిని. ఆమెతోపాటు దీర్ఘదర్శి ఈ ప్రవాదం గురించి ఆలోచించాడు. ఇలాటి జనప్రచారాన్ని తొలగిద్దామనే దృష్టితో తీర్థయాత్ర సాకుతో ఒంటరిగా ఒక రాత్రి బయలుదేరాడు.

అలా బయలుదేరిన మంత్రి మహోదధి

తీరప్రాంతం చేరాడు. అక్కడ అతనికి నిధిదత్తుడనే సార్థవాహుడు మిత్రుడయ్యాడు. అతడేమో సౌవర్ణ ద్వీపానికి వెళ్ళుతున్నాడు. అతనితోపాటు అతని ఓడ ఎక్కి సౌవర్ణ ద్వీపానికి బయలుదేరాడు.

ఓడ మహోదధి మధ్యకు చేరింది. గాలి ఏమీలేదు. ఝంఝామారుతం అసలే లేదు. కాని, నీటి అల పెద్దగా స్తంభంలాగా పైకిలేచింది. హఠాత్తుగా అది స్ఫటికాచల శిఖరంలాగ తెల్లగా మెరిసిపోతున్నది. దాని మధ్యన బంగారం చెట్టొకటి కనిపించింది. అది దేవాసురులు మళ్ళీ తనను మథిస్తారేమోననే భయంతో సముద్రుడు రెండవ పారిజాత వృక్షాన్ని పైకివదిలాడా అన్నట్టుంది. ఆ స్వర్ణ వృక్షం నీడను పగడాలకొమ్మలతో చిత్రవిచిత్ర రత్నాల లతలు చుట్టుకొన్న మాణిక్య పర్యంకంమీద ఒకకన్య కూర్చుని వున్నట్టు కనిపించింది. ఆమె పెదవులు పద్మరాగాలలాగ వున్నాయి. ఆమె నల్లని ముంగురులు కదులుతూ ముఖానికి సొమ్ముగా వున్నాయి. ఆమెనవ్వు ముత్యాలు ఒలకబోసినట్టుంది. ఆమె సముద్రదేవతే రూపుదాల్చి వచ్చిందా అన్నట్టుంది.

ఆ కన్యనుచూచి మంత్రి ఆశ్చర్యపడ్డాడు. సర్వాంగాలు ఆశ్చర్యంతో విప్పారాయి. ఇంతలో ఆమె ఒకగీతం పాడింది. అది ఆమె ముఖాంభోజం చుట్టూ మూగే తుమ్మెదల రొదలాగా వినిపించింది. ఆగీతం భావమిది.

'ఎవడు ఎప్పుడు ఏమిచేశాడో వాడు దానిని పొందడానికి అప్పుడు అక్కడికి వెళ్ళుతాడు. లేకపోతే కర్మ తన పాదుగాటి పాశాలతో వాడిని అక్కడికి లాక్కుపోతుంది అని అందాము. ఈ శరీరధారులు ఎక్కడికి వెళ్ళితే అక్కడికి శుభాశుభాలు వెళ్ళుతాయి; పూవులతోపాటు తావిలాగను, మిణుగురు పురుగులతోపాటు వెలుతురులాగను. ఈ కర్మక్షేత్రంలో ఎవడు ఏమి నాటాడో దానిఫలమే వాడు అనుభవిస్తాడు. అంతేకాని అంధుడు పట్టుకున్న వస్తువుకదా, ఎలాగో వానికి తెలియకుండా తీసుకుందాము అని కళ్ళుగలవాడు ఉపాయాలు పన్నినా ప్రయోజనం లేదు.'

ఈ గీతాన్ని కర్ణామృతంగా ఆమె వీణతో మేళవించి వెదజల్లి పర్యంకం బంగారు చెట్టులతోపాటు మాయమై పోయింది.

ఆ కన్యనుచూచి అశ్చర్యంతో కదలకుండా నిలబడిపోయి ఆమె అంతర్ధానం కాగానే మరింత ఆశ్చర్యంతో అటువైపే దీర్ఘంగా చూస్తున్న దీర్ఘదర్శిని చూచి, ఓడ కర్ణధారుడు బర్బరాధిపుడు నవ్వి ఇలా అన్నాడు: —

'ఎందుకలా చూస్తారు ఆశ్చర్యంతో? ఈకన్య ఎప్పుడైనా ఇక్కడ కనిపిస్తూ వుంటుంది. ఈమె కులమేమో, శీలమేమో ఎవరికీ తెలియవు.'

కర్ణధారుడు ఆ అద్భుతాన్ని గురించి అలా అంటుండగా అనుకూలమయిన గాలులు వీచడంవల్ల ఓడ స్వర్ణద్వీపం చేరింది. సార్థవాహుడయిన నిధిదత్తుడు తక్కినవారు ఓడదిగి, ద్వీపంలోని తమ భవనాలకు వెళ్ళారు. సార్థవాహుడు క్షణంలో తనపనులు పూర్తిచేసుకున్నాడు. మంత్రి అతని అభ్యర్థనపై అతని భవనంలో చాలాకాలం గడిపి స్వనగరానికి తిరిగి వెళ్ళాడు.

అక్కడ అంగదేశంలో యశఃకేతువు మంత్రి వియోగాగ్నితో తపించిపోతున్నాడు, 'మహారాజా దీర్ఘదర్శి తిరిగివచ్చారు' అని ద్వారపాలకులు విన్నవించగానే, రాజు సంతోషం పట్టలేక వెంటనే ద్వారం వద్దకువచ్చి మంత్రిని కలుసుకొన్నాడు; కళ్ళు పెద్దవిచేసి మంత్రినే చూస్తూ, త్రైలోక్య రాజ్యంకూడా ఇక వ్యర్థమని భావించాడు. మంత్రిని ఆలింగనం చేసుకొని, 'ఎంత నిరాదరులై వెళ్ళిపోయారు ఇల్లు, బంధువులను, భార్యను, సంపదను, నన్నూనవదలి' అని ప్రశ్నించాడు.

తను పుణ్యతీర్థార్థియై వెళ్ళానని దీర్ఘదర్శి రాజును సమాధానపరచి సముద్రంలో చూచిన ఆశ్చర్యాన్ని దివ్యకాంత గీతాలాపాన్ని చెప్పాడు.

మంత్రి మాటలకు రాజులో నూతనోత్కంఠ పెల్లుబికింది. పూర్వజన్మప్రియాజనం సంగతి విన్నవెంటనే మనస్సులో ప్రవేశిస్తుంది. రాజు స్మరాతురుడై తన రాజ్యం దీర్ఘదర్శికి ఉంకువపెట్టి, భిక్షువేషంధరించి ఆ శశాంకవదనను చూడాలని బయలుదేరాడు.

నదులు, వెట్టకొలు, గనులు, అరణ్యాలు, గ్రామాలు పర్వతాలు, దాటి శ్రీపర్వతంచేరి, హరిప్రియ అయిన దేవిని పూజించాడు. అక్కడ కుశనాథుడనేముని, యశఃకేతువును ఆశీర్వదించాడు — నీకు నీ ప్రియురాలు లభిస్తుంది—అని. ఆముని ఆదేశం ప్రకారం ఒక సార్థవాహుని వద్దకు వెళ్ళాడు.

అ సార్థవాహునిపేరు లక్ష్మీదత్తుడు. రాజు అతని వోడఎక్కి ప్రియపై ఆశతో సముద్ర మధ్యం చేరాడు. జలధిమధ్యాన వైడూర్య శిఖరాకార తరంగ మాలికలు చుట్టుకొన్న జలస్తంభం మునుపటిలాగే పైకిలేచింది. దానిలో రత్నవృక్షం చూచాడు. ఆ రత్నవృక్షం విధాత విచిత్రాలు నిర్మిద్దామని రమ్యమయిన ఉపకరణ సంపత్తిని సముద్రుని చేతుల్లో జాగ్రత్తగా. పెట్టివుంచాడా. అన్నట్టు వుంది.

ఆ కల్పవృక్షం కింద దివ్యకన్య ఒకతె గానంచేస్తూ కనబడింది. ఆమె రత్న పర్యంకంమీద కూర్చుంది. అనంగమంగళదేవతలాగవుంది. మహోదధినుంచి తన లావణ్య పుణ్యగాత్ర రేఖతో అమృత వీచి కలతోసహా లక్ష్మీదేవే తిరిగి వస్తున్నదా అన్నట్టుంది.

ఆమెను చూడగానే రాజు సంతోషాశ్చర్యాలతో వణికిపోయాడు. 'ఆహా! ఏమి రూపం! అహా! ఏమికాంతి!' అంటూ మెడ తిప్పసాగాడు.

ఆకన్య మునుపటిలాగే చిత్ర పదమాలలతోవున్నగీతాన్ని సస్వరంగా తాళలయానుగుణంగా పాడి, చెట్టుతోపాటు మునిగిపోతూ వుండడం రాజు చూచాడు.

'రత్నాకరా, భగవాన్, నీవు చంద్ర కౌస్తుభ కమలాపీయూష వారుణ్యాదులను కన్నవాడివి. నీకు జయం. నాలోచన పత్రాలకు అమృతంవంటి కాంతను నాకు దానంచేయి.' అంటూ సముద్రపునీటిలో దూకాడు, స్మరదవానలాన్ని ఆర్పుకొందామనే సాహసంతో. ఆయనను వోడలో పిలుచుకొని వెళ్ళుతున్న సార్థవాహుడు లక్ష్మీదత్తుడు దుఃఖసముద్రంలో మునిగాడు. 'ఈయన యశఃకేతువనే రాజు. తన పూర్వభార్యను వెతుక్కొనడానికి సముద్రంలో దూకాడు, నీవు వగవకు' అని

అశరీరవాణి వినిపించింది. ఆ వాణిని విని లక్ష్మీదత్తుడు అనుకూల పవనాలవల్ల సముద్రయానం సాగించి తన పనులు పూర్తి చేసుకొని తనపట్టణం చేరుకున్నాడు నెమ్మదిగా.

యశఃకేతువు సముద్రగర్భం చేరాడు. బంగారు మేడలుగల ఒక పట్టణం కనిపించింది. దానిచుట్టూ రత్నాల ప్రాకారం వుంది. అక్కడ ఒక్కరూ కనిపించలేదు. మాణిక్య మయభవనాల వరుసను గాలించాడు. అంతా శూన్యం. ఇంకా వెదుకుతూపోయాడు. ఒక నిర్జనమైన బంగారు భవనంలో, మణిమయ మంచంమీద కప్పుకొని పడుకొని వున్నది ఆ కన్య.

రాజు దగ్గరికి వెళ్ళాడు. సూర్యుడు కమలంమీద ఆవరించిన మంచుతెరను తొలగించి చూచినట్టు ఆమె ముఖంమీద ముసుగు తొలగించి ముఖకమలం చూచాడు.

ఆ కన్య మేల్కొన్నది. రాజును చూచింది. మనస్సులో ఆశ్చర్యం నిండింది. 'ఇతడు భిక్షువుకాడు. మారువేషం ధరించి వచ్చాడు. చక్రవర్తిపదానికి అర్హుడు. ఇతడు యశఃకేతురాజే. నిజం. సిరులు ఒలికే వాడు, కమలనయనుడు.' అని అనుకొంది. దానితో వణికింది స్మరవల్లరి లాగా. మన్మథసుందరాలయిన అంగాలు పులకించి, దేహానికి కడిమి మొగడల

# ...బృహత్కథామంజరి

అందం తెచ్చాయి.

ఆకన్య సిగ్గుతోనే ఆతనిని సత్కరించింది, ఆయనను ప్రశ్నించింది, ఎక్కడివారు, ఏమి అని. రాజు తన సంగతి చెప్పి మంచంపై కూర్చున్నాడు.

ఆయన వంశం, యశఃకేతువనే పేరు స్పష్టంగా విని ఆకన్య ఒళ్ళు స్వేదంతో తడిసి కంపించగా, నీటిలో కదలాడే చంద్రకల ప్రతిబింబంలాగా కనిపించింది.

భృంగం నెమ్మదిగా మొగ్గను విప్పారజేసేటట్టు ఆరాజు ఏవేవో వర్ణనలతో తీయని మాటలతో ఆకన్య సంతోషంతో వికసించేటట్టు చేశాడు. వారి మనస్సు అప్పుడు స్పష్టంగా సుఖాభిముఖమయింది. ప్రథమ సమాగమంలోను మన్మథుడు సిగ్గును సహించడు.

'నాథా నేను నీ అధీనను. కాని, కృష్ణపక్ష చతుర్దశి, అష్టమి నన్ను వదలాలి. ఇది నా బాధ. నేను చాల మెత్తని దానిని. ప్రౌఢలతో వ్యవహరించినట్టుగా వ్యవహరించకు' అంటూ గోల పెడుతున్న ఆసుందరి మొలనూలు పట్టుకొని లాగాడు రాజు. అందంగా, దానితో పాటు కట్టుకున్న పట్టుచీర కూడా వచ్చింది. ఆమె తన నగ్నసౌందర్యాన్ని

రాజు ఎక్కడ చూస్తాడో అనే భయంతో అతనిని గాఢంగా కౌగిలించుకుంది.

అప్పుడు ఎవరు ఎవరో విడదీయరానట్టుగా వారు కలిసిపోయారు. మర్యాదలు, వినయక్రమాలు, వికల్పాలు లేనిస్థితి ఏర్పడింది, వారిద్దరికీ. ఆమె కొప్పు వీడింది. కొప్పులోని పూవులు జారాయి. చెమట బిందువులతో నొసటి తిలకం తడిసి తేలాడింది. కన్నులు అరమోడ్చాయి. అప్పుడు ఆమె శరీరం ఎంతో అందంగావుంది.

ఇలా ప్రతిరాత్రీ సుఖమనుభవిస్తూ వుండగా చతుర్దశి వచ్చింది. ఆ సుందరి రాజు అనుమతితో వెళ్ళిపోయింది. పోతూ పోతూ, 'నా స్వామీ, ఈ నళినీ మండపంలో ప్రవేశించవద్దు.' అని చెప్పి వెళ్ళిపోయింది.

రాజు ఆమెకు తెలీకుండా ఆమెవెంట వెళ్ళాడు. చేతిలో విచ్చుకత్తి ఉంది. దూరంగా నిలబడి ఏమి జరుగుతుందో చూద్దామని నిలబడ్డాడు.

అప్పుడొః రాక్షసుడు మేఘంవంటివాడు కనిపించాడు. రాహువు చంద్రలేఖను మింగినట్లుగా, ఆ రాక్షసుడు ఆమెను మింగివేశాడు. రాజుకు దుఃఖమూ కోపమూ పెనవేసుకొన్నాయి. చేతిలోని కత్తి వానిమీదికి విసిరాడు. ఆ కత్తి దెబ్బకు ఆ రాక్షసుని తల, పింగళవర్ణ కేశయుక్తమయినది భూమిమీదికి దొర్లింది. అది చూడగా, దావాగ్నితో మండిపోయే నీలాచలశృంగం దొర్లిపడినట్టనిపించింది. అతని ఉదరగుహాగర్తం నుంచి ఆ సుందరి వెలుపడింది. ఆమెకు శాపవిమోచన మయింది. పూర్వకథ జ్ఞాపకం వచ్చింది. రాజుతో ఇలాఅన్నది:

'రాజా నేను విద్యాధరరాజు మృగాంకసేనుని పెద్దకూతురిని. పేరు మృగాంకవతి. నా అన్నదమ్ములు వేయిమంది. నా తండ్రి నన్నువదలి ఒక్కనాడైనా భోజనం చేయరు — దివ్యమైన షడ్రసోపేత భోజనం. తనవంటి అంతమంది కుమారులున్నా నేను పంక్తికి ఉండాలి.

'ఒకమారు గౌరీ చతుర్దశీ వ్రతం వచ్చింది. నేను ఆనాడు ఉపవాసం చేశాను. ఆ దినం నా తండ్రికి భోజనం లేకపోయింది. దానితో ఆయన కోపగించు



కాని, శపించాడు — చెతుర్దశినాడు, అష్టమినాడు ఎప్పుడూ నిన్ను నిశాచరుడు మింగి వదులుతాడు. విద్యాధర విద్యలు నశించి చాలకాలం శూన్యపాతాళంలో నివసిస్తావు. అంగ రాజయిన యశఃకేతువు నిన్ను ప్రేమిస్తాడు. అతడు ఎంతవరకు ఆ రాక్షసుడిని పరిమార్చడో అంతవరకూ నీకు శాపం తప్పదు—అని.

'నా తండ్రి నాకి శాపం పెట్టాడు. నీవు ఆ రాక్షసుణ్ణి వధించావు. నా శాపం విడిపోయింది. నా విద్యాధర విద్యలు మళ్ళీ నాకు సంక్రమించాయి. ఇక వెళ్ళతాను.'

రాజు ఆ మాటలకు దిగ్భ్రాంతుడయ్యాడు. 'చక్కని కనుబొమలు గల దానా, ఏడునాళ్ళు మాత్రమే నాతో విహరించి ఎక్కడికి వెళ్ళతావు?' అని దీనంగా అడిగాడు.

అతడు ఇలా ప్రార్థించగా, లేడి కన్నుల ఆ ముగ్ధ తన బంగారు అరటి చెట్ల వనంలో విహరించింది. ఆ కేళీ రభసంలో ఆ ఉద్యానవనంలోని పుష్కరిణిలో స్నానం చేశారు ఇద్దరూ; అంగ రాజ్య రాజధానిలోని సరోవరంలో తేలారు.

రాజు దీర్ఘదర్శిని పిలిపించాడు. తన సంగతి వినిపించాడు. ప్రియాప్రాప్తితో మహోత్సవాలు జరిపి, రాజ్యపాలనకు పూనుకున్నాడు.

విద్యాధర సుందరి వారం తర్వాత ఆకాశంలోకి ఎగిరి తన లోకానికి వెళ్ళదలచింది. మానవ సంగతివల్ల ఆమెకు గగనయాన విద్య మరిచిపోయింది. అందువల్ల తన లోకానికి వెళ్ళలేకపోయింది. తన ప్రియురాలు విద్యావిహీన అయినందుకు రాజు ఆనందంతో గంతులు వేశాడు. ఆ వెడదకన్నుల సుందరినే నిరంతరం సేవిస్తూ, గడిపాడు.

ఆ ఉత్సవ సమయంలోనే ఒకరాత్రి దీర్ఘదర్శి గుండె పగిలి మరణించాడు. కారణమేమిటో ఎవరికీ తెలియలేదు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ఇలా ప్రశ్నించాడు: "రాజా, మంత్రి మరణించాడే అకస్మాత్తుగా. దానికి కారణమేమిటో చెప్పు. రాజు పిలుచుకొని వచ్చిన మృగనయనను చూచి, నేను ఆమెను పొందలేకపోతినే, అని గుండె పగిలిందా? లేక, నాకు రాజ్యం చేజిక్కింది. రాజు సముద్రంలో దూకినా మరణించలేదే, తిరిగి వచ్చాడే అనా? వాస్తవ తత్వ మేమిటో చెప్పు'. అని ప్రశ్నించాడు.

విక్రమసేనుడు ఇలా అన్నాడు: 'సఖా ఆ మంత్రి మరణించిన కారణం విను. ఈ రాజు స్వభావరాగి. ఇతనికి దివ్యాంగన లభించింది. ఇక తన రాజ్యపాలన విధిని పూర్తిగా మానుకుంటాడు — అనే దుఃఖంతో గుండె పగిలింది మంత్రికి.'

ఈ మాటలు వినగానే భేతాళుడు మళ్ళీ అంతర్హితుడయ్యాడు. విక్రమసేనుడు మళ్ళీ చెట్టెక్కి అతనిని దించి, భుజంమీద వేసుకొని బయలుదేరాడు.

(ఇంకా ఉంది)

# ఉపనాయిక పాత్ర ధరిస్తున్న కొత్త తార స్నేహప్రభ



ఫల్గుణావారి 'జగత్ జెట్టీలు' చిత్రంలో స్నేహప్రభ అనే కొత్తతార ఉపనాయిక పాత్ర ధరిస్తున్నట్టు ఇదివరకే మీకు తెలిపి వున్నాను. ఇప్పుడు ఆమెతో జరిపిన భేటీని మీకు తెలుపుతున్నాను.

ప్రశ్న: మీరు నటిస్తున్న మొదటి చిత్రం ఇదేగా?

జ: అవును.

ప్ర: మీకు ఇలా అవకాశం ఎలా దొరికింది?

జ: ఏదో మేగజైనులో నా ఫోటోను చూచి కబురు పంపించారు.

ప్ర: మేకప్‌టెస్టు చేసారా?

జ: లేదు ఒకటికి పదిసార్లు క్రింది నుండి పైవరకు చూచారు. మరుదినమే షూటింగుకు రమ్మన్నారు

ప్ర: మొట్టమొదటిసారి కెమెరా ముందు నిలబడినప్పుడు ఎలా వుండింది?

జ: ఒళ్ళంతా చెమటలు పట్టాయి శరీరమంతా వణుకసాగింది. నోటంట మాట రాలేదు.

ప్ర: మరి ఎలా నటించగలిగారు?

జ: శ్రీ ఎస్వీరంగారావు, వాణిశ్రీ, చంద్రమోహన్లు నాకిచ్చిన ప్రోత్సాహ బలమే నన్ను నటింప చేసింది

ప్ర: మీకు నాటకానుభవం లేదా?

జ: లేదు స్కూలు డ్రామాలో వేసే దాన్ని.

ప్ర: సినిమా పిచ్చి ఎప్పుడు యేర్పడింది?

జ: నేను చిన్నప్పట్నుండీ విపరీతంగా సినిమాలు చూచేదాన్ని. ముఖ్యంగా శ్రీమతి జమున నటించిన వాటిని రెండు మూడు సార్లు చూచేదాన్ని అప్పట్నుండే సినిమా నటి కావాలనే కోరిక గల్గింది.

ప్ర: ప్రస్తుతం ఎన్ని చిత్రాల్లో నటిస్తున్నారు?

జ: 'జగత్ జెట్టీలు', ఉత్తమ చిత్ర వారి సాంఘికం.

ప్ర: మీకు ఈత వచ్చా! వంటవచ్చా?

జ: ఈత నేర్చుకుంటున్నాను. బ్రహ్మాండంగా వంట చేస్తాను.

ప్ర: ప్రతిరోజూ మీరేం చేస్తుంటారు?

జ: ఉదయం డ్యాన్సు ప్రాక్టీసు; తర్వాత ఒక గ్లాసెడు మజ్జిగ. ఆపైన స్నానంచేసి పూజచేస్తాను. మధ్యాహ్నం నిద్రపోను, నవలలు చదువుతాను. సాయంకాలం పిక్చరుకు వెళ్ళడమో లేక షాపింగుకు వెళ్ళడమో జరుగుతుంది. రాత్రుళ్ళు పదికల్లా పడుకుని నిద్రపోతాను.

ప్ర: మీరు తారగా నిలబడగలనన్న నమ్మకం మీకుందా?

జ: నేనెలా చెప్పగలను, విధి వ్రాసినట్టు జరుగుతుంది. నా ప్రయత్నం నేను చేస్తాను

ప్ర: 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో ఇంటర్వ్యూ కావాలని కోరడంలో మీ అభిప్రాయం ఏమిటి?

జ: ప్రతి యింట్లో పత్రిక వుంటుంది గనుక, ప్రతివారూ చదువుతారు గనుక, చదివేవాళ్ళు నా ఫోటోను చూస్తారు గనక, చూచినవాళ్ళు నన్ను (సినిమాల్లో) యిస్తారనే వుద్దేశ్యం వుంది గనకనే.

ప్ర: ఇప్పుడు మీ ప్రోగ్రాము ఏమిటి?

జ: ఇవాళ శుక్రవారం గదండీ: తలంటు స్నానం చెయ్యాలి. మరి వుంటా? అంటూ నన్ను పంపించి వేసింది...

—ఇంటర్వ్యూ: శ్రీనివాస్

# తేఖ్రా వాక్రో భారతి



ఆర్. గంగాధర్, కామారెడ్డి.

ఒక హీరోతో ఒక హీరాయిన్ ఒకసారి చెల్లెలిగా మరొకసారి ప్రియురాలిగా నటించేప్పుడు ఆమె మనోభావాలు ఎలా గుంటవి ?

చెల్లెలిగా నటిస్తున్నప్పుడు, ఒక సోదరుడు తన అనుంగు చెల్లెలితో ఎలా ప్రవర్తిస్తాడో, అదేభావంతో హీరో నటిస్తాడు. అలాగే ప్రియురాలిగా వున్నప్పుడు, తన అర్ధాంగితో ముచ్చటలాడే రీతిలో హీరో యాక్టు చేస్తాడు. ఇది కేవలం నటన మనస్సుతో నిమిత్తం లేదు.

ఎస్. హెచ్. ప్రసాద్, ఖమ్మం.

కొత్తగా సినిమారంగంలో ప్రవేశించాలనుకునే నటీనటులకు మీరిచ్చే సలహాలు ఏమిటి ?

వచ్చినప్పుడు ఎలా వుంటారో, అవకాశాలు వచ్చి నిలబడ్డప్పుడు కూడా అలాగే వుండమని మాత్రం చెప్పగలను.

టి. పద్మావతి, వెల్లటూరు.

'కలసిన మనసులు' చిత్రంలో మీ తండ్రిగారు పెట్టిన కండిషన్స్ ప్రకారం మీ నిజజీవితంలో అలా పెడితే ఏంచేస్తారు మీరు ?

మా తండ్రిగారు చెప్పినట్టే యింతవరకు నడుస్తున్నాను. నా మంచిని కోరే మా తండ్రిగారు ఎప్పుడు, ఏం చెప్పినా అలాగేనని తలూపుతాను.

గోదావరి శ్రీరామమూర్తి, మురమండ.

మీ పర్సనాలిటీ చాలా బాగుంటుంది. ఏ అందాల పోటీలోనైనా పాల్గొంటే తప్పక బహుమతి వస్తుందిగా ?

నా పర్సనాలిటీ బాగుండబట్టే యింకా నేను హీరాయిన్‌గా నిలబడగల్గుతున్నాను. మీలాంటి అభిమానుల ఆశీస్సులతో వుత్తమనటి బహుమతి నందుకుంటే అదే నాకు పదివేలు.

జి. జి. రావు, కామారెడ్డి.

మీరు సినిమాల్లో డబ్బు గడించడం కొరకా ? పేరు ప్రఖ్యాతులు కొరకా ? లేక కళాసేన కోసమా ? సరదాకొరకా ?

డబ్బు గడిస్తూ, పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటూ, కళాసేవ చేస్తూ, సరదాగా కాలం వెళ్ళబుచ్చడానికే నటిస్తున్నాను.

ఎం. ఎస్. ఆర్, కనిగిరి.

ఏమండి భారతిగారూ, ఎన్.టి. ఆర్; ఎ. ఎన్. ఆర్. లపై మీ అభిప్రాయం ఏమిటి ?

నా కంటే అన్నివిధాలా గొప్పవారయిన రామారావు, నాగేశ్వరరావు గార్లపై నాకున్న భక్తి గౌరవాలు ఎంతటివో వాళ్ళను అడిగి తెలుసుకోండి. మహా నటులయిన వాళ్ళిద్దరిపై నేను ఏమని చెప్పి మిమ్మల్ని తృప్తిపరచగలను చెప్పండి!

బి. సి. హెచ్. శామ్యూల్, నందికొట్కూరు.

మీకు యింకా స్పష్టంగా తెలుగుడైలాగులు రావని నేను, వస్తాయని మా అక్కయ్య యిరువురము పందెం వేసుకున్నాము. ఏది నిజము ?

నాకోసం మీరు పందెం వేసుకోవడమా ? తెలుగు స్పష్టంగా తెలియకపోయినా, డెలివరీ చేసేటప్పుడు కరెక్టుగానే చెప్పగలను సుమండీ. కావాలంటే "జైజవాన్" చిత్రం చూడండి.

విజయరావ్, శ్రీకూర్మం.

ఏమండీ 1969 లో మీరు సాధించినది, 1970 లో మీరు సాధించదల్చుకున్నదీ ఏదైనా వుందా ?

వుంది. చాలావుంది. నేను అనుకున్నది సాధించిననాడు మీకు తప్పక తెలుస్తుంది. సరేనా ?

రాము, పుల్లంచెర్వు.

మీకు సినిమా జీవితం ఎలా అనిపిస్తుంది ? ప్రశ్నలకు జవాబు లిస్తున్నప్పుడు ఎలాంటి అనుభూతి కల్గుతుంది ?

చాలా హాయిగా వుందనిపిస్తుంది జవాబు లిస్తున్నప్పుడు నాకు యింత అభిమానంవుందా అని పిస్తుంది.

తోట రామారావు, మచిలీపట్నం.

మీరు ద్విపాత్రాభినయం చేసినచిత్రం ఏది ?

అన్నపూర్ణాపిక్చర్స్ "జైజవాన్" చిత్రం; అందులో నేను సుశీల, సుజాత పాత్రలను పోషించాను.

ఎం. శేషతల్పశాయి, హైద్రాబాదు.

మీకు ఏఏ పాత్రలు ధరించడము యిష్టమో తెలియచేస్తారా ?

వ్యాంప్ పాత్రలు తప్ప మరే పాత్ర అయినా చెయ్యగలను. ●



'మెరుపువీరుడు'లో కాంతారావు, రాజబాబు, లక్ష్మి, శ్యామల

చిత్రసమీక్ష :

# మెరుపు వీరుడు

ద్విపాత్రాభినయం అనగానే ఒకళ్ళు మరొకళ్ళుగా మారి కథని సాయం పట్టడం మామూలు. ఇలా చాలా చిత్రాల్లో చూశాం. చిత్రాల్లో ద్విపాత్రాభినయం — కథలో కొత్తదనం తీసుకురావడానికి కాక పోయినా నటుని సామర్థ్యానికి ఉదాహరణగా వుండి ఆ నటునిపేర చిత్రాన్ని నిలబెడు తున్నాయి. అజంతా మూవీస్‌వారి 'మెరుపు వీరుడు' జానపద చిత్రంలో కాంతారావును తెర నిండుగా చూడగలుగుతాం.

మామూలుగానే ఇద్దరు కవలపిల్లలు వేరైపోతారు. ఒకడు యువరాజు, మరొకడు దొమ్మరిగూడెం దొరబిడ్డ! ఇక్కడ యువరాజు స్వాతంత్ర్యరహితుడుగా పిన తండ్రి చేతులో ఆటబొమ్మగా పెరిగాడు. అడవిలో పెరిగినవాడి కెప్పుడూ ఆ స్వతం త్రానికి లోటుండదు! అన్ని చిత్రాల్లో లానే యువరాజుని దొమ్మరిగా పెరిగిన సోదరుడు కాపాడుతాడు యువరాజు సింహా సనం అధిష్ఠించడం అదొక ఘట్టం! వేర్పడిన — అన్నదమ్ములు కలుసుకోవడం ద్వారా చిత్రం శుభాంత మవుతుంది.

ఈ కథలో జనాన్ని బాగా ఆకర్షించేది కాంతారావు ద్విపాత్రాభినయం. రెండు పాత్రలలోను ప్రతిభావంతమైన నటన కనబరిచారు కాంతారావు. ఫోటోగ్రఫీలో ఇంకొంచెం శ్రద్ధ తీసుకుని వుంటే ఆ పాత్ర ఇంకా బాగా రాణించి వుండేది టెక్నికల్‌గా ఆశించిన ప్రమాణాన్ని అందుకో లేక పోవడం చిత్రానికి ఒకలోపమే. ఉన్నంతలో — భారీ దృశ్యాలు, గగుర్పొడిపించే యుద్ధ సన్నివేశాలూ చిత్రాన్ని ఆకర్షణీయంగా తయారు చేశాయి.

కథని చిత్రీకరించడంలో ప్రత్యేకత లేకపోలేదు ఈ ప్రత్యేకతే లేకపోతే చూసిన సినిమా చూస్తున్నట్టుగానే కనిపించి వుండేది కూర్పు, దర్శకత్వం బాధ్యతల్ని నిర్వహించిన బి హరినారాయణ కృషి ప్రశంసనీయం.

జి. కె. మూర్తి కథ, సంభాషణలు చిత్రాన్ని చురుగ్గా నడిపించాయి. రాజ్ బాబు హాస్యం, రాజశ్రీ, లక్ష్మిల మనోహర మైన నటన చూడ ముచ్చటగా వున్న ఈ చిత్రంలో రాజనాల, ధూళిపాళ, ప్రభాకర రెడ్డి, నల్లరామూర్తి, విజయలలిత మొద లైనవారు తదితర ముఖ్య పాత్రలని ధరించారు.

ఘంటసాల సంగీతం, చెంచులక్ష్మి వీధి నాటకం విశేషాకర్షణగా కూర్చిన 'మెరుపు వీరుడు' నిర్మాతలు బి. వి కృష్ణమూర్తి, కె. మహేంద్ర. పూర్ణా రిలీస్.

— సితరాజు ●

## సినిమా డైరీ

● మురుగన్ బ్రదర్స్ "చిట్టిచెల్లెలు" షూటింగు ఎ. వి. ఎం. స్టూడియోలో మార్చి 10నుండి 16 వరకు జరిగింది. శ్రీ రామారావు, వాణిశ్రీ, హరనాధ్, రాజశ్రీ, పద్మనాభం, గీతాంజలి మరియు గుమ్మడి పాల్గొన్నారు.

● విజేతా పిక్చర్స్ నిర్మిస్తున్న రెండవ చిత్రానికి "తల్లిదండ్రులు" అని పేరు పెట్టారు. శ్రీ బాబూరావు దర్శకుడు. హరనాధ్ ఒక ముఖ్యపాత్రను పోషిస్తారు, హీరో శ్రీ జగ్గయ్య.

● నవశక్తి పిక్చర్స్ వారి రెండవ చిత్రంలో కథానాయిక పాత్రలను వాణిశ్రీ, శారదలు ధరిస్తారు. శ్రీ సి. ఎస్. రావ్ దర్శకత్వం నెరపనున్న యీ చిత్రంలో శ్రీ రామారావు నాయకుడు. శ్రీ పి. గంగాధరరావు నిర్మాత.

● జగపతి ఆర్ట్సు పిక్చర్స్ "దసరాబుల్లోడు" పాటల రికార్డింగు మార్చి 2 నుండి 10 వరకు విజయా గార్డెన్స్‌లో జరిగింది. ఈ చిత్రానికి మహదేవన్ సంగీతదర్శకుడు, శ్రీ వి. బి. రాజేంద్ర ప్రసాద్ నిర్దేశకుడు, శ్రీ అక్కినేని కథానాయకుడు.

● శ్రీ పద్మాలయ "అగ్నిపరీక్ష" షూటింగు ప్రసాదులో ఆరు సెట్లలో జరిగింది. విజయలక్ష్మి నృత్యాన్ని దర్శకుడు శ్రీ వరప్రసాదరావు కలర్‌లో తీసారు. కృష్ణ, విజయనిర్మల, గుమ్మడి, పద్మ నాభం, నాగభూషణంగార్లు పాల్గొన్నారు.

# జయలలిత మనస్సు దోచుకున్న రామారావు

అపరంజి బొమ్మలాంటి జయలలిత అవయవ సోయగాన్ని ఆజానుబాహుడయిన ఎన్. టి. రామారావు కళ్లప్పగించి చూడడాన్ని అన్నులమిన్న జయలలిత ఓరకంటితో చూచింది. ఆమె చూపులు రామారావు మనస్సులో తియ్యటి భావాలను రేకెత్తించాయి. ఆయనలోని ప్రతిఅణువు ఆమెనే కోరసాగింది. మనస్సులోని మాటను పాటరూపంలో బయటపెట్టారు. రామారావు ఏమనో తెలుసా?

ఓమేరీదిల్‌రుబా, ఓమేరీమెహ బూబా!
మరీ అంతగా బిడియమైతే
మనసు ఆగనంటుంది
చిలిపికనులు కలుసుకుంటే
వలపు పొంగిపోతుంది.

అంటూ సిగ్గుపడుతున్న జయలలితను దరి చేరబోతాడు శ్రీ రామారావు. మరి జయలలిత వూరుకుందా? అబ్బే అలా వూరుకుంటే ఎలా? అందుకే ఆమెకూడా తన గుండెలో దాచుకున్న రహస్యాన్ని బయట పెట్టింది.

మరీ అంతగా వెంటబడితే
మనసు ఝల్లుమంటుంది
కనులు కనులూ కలుసుకుంటే
తనువు ఝల్లుమంటుంది

అని తను ప్రేమించినవాడ్ని తన లేత హస్తాలతో బంధించింది; ప్రేమికులిద్దరూ అదమరచి హాయిగా, హుషారుగా ఎడబాయని జంటగా వుండాలని నిశ్చయించుకున్నారు. 'అలీబాబా నలభైదొంగలు' చిత్రంలో పై శృంగార సన్నివేశం కనిపిస్తుంది. అలీబాబాగా ఎన్. టి. ఆర్. మార్జియానాగా జయలలిత నటించారు.

ఈ చిత్రకథలో శ్రీ నరసరాజు ఎన్నో కొత్త అంశాలను జొప్పించారు, అలాగే శ్రీ ఘంటసాల ప్రతిపాటలో వివిధ వాయిద్యాల సహాయంతో మధురాతి మధురమయిన సంగీతాన్ని వినిపించారు. చిత్రం ఆద్యంతం ఆసక్తిని కలిగించే విధంగా శ్రీ విఠలాచార్య డైరెక్టు చేసారు. ఎన్. రామబ్రహ్మం నిర్మిస్తున్న ఈచిత్రం అతి త్వరలో గౌతమి పిక్చర్స్‌ద్వారా విడుదలవుతుంది.

## సినిమా



'నా దేశం'లో హరనాథ్, చంద్రకళ



'మూగప్రేమ'లో వాణిశ్రీ, విజయలలిత

*

లక్ష్మి (మెరుపు వీరుడు) నాయిక శోభన్‌బాబులు ఒకే కాలేజీ విద్యార్థులు. శోభన్‌బాబు బాస్కెట్‌బాల్ ఛాంపియన్; లక్ష్మి టెన్నికాయిట్‌లో ఎక్స్‌పర్ట్. ఇద్దరూ ఒకటి కావాలనుకున్నారు. ఇద్దరి మనస్సులు మాటాడుకున్నాయి, ఇద్దరి కళ్లు కలిసాయి. ఇద్దరి అభిప్రాయాలు ఏకమయ్యాయి. వీరిప్రేమ దినదిన ప్రవర్ధమానమయింది. ఈ వ్యవహారం పెరిగి పెద్దదైంది. ఇద్దరికీ అలా చల్లగాలిలో తిరిగి రావాలనిపించింది, ఏకాంతంగా కాస్సేపు కాలం వెళ్లబుచ్చాలనిపించింది. అందుకే లక్ష్మి, శోభన్లొకసారి డాంకు వెళ్లారు. డాంను, పరిసర ప్రదేశాలను యిద్దరూ తిరిగి చూసారు, ఇద్దరి పెదవులు కదిలాయి. ఆనంద పారవశ్యంలో యిద్దరి గొంతులు పలికాయి.

ఈ బ్రతుకే ఒక ఆట
తీయని వలపుల బాట
గెలుపేగాని ఓటమిలేని
పందెపు పరుగులవేట—నయ్యారే

అంటూ లక్ష్మి శోభన్‌బాబులు వుల్లాసంగా ప్రేమపాటలో లీనమయ్యారు రతీమన్మథుల్లా యిద్దరూ తమ యిష్టాను సారంగా ప్రణయ ప్రవాహంలో యీద



'తాళిబొట్టు'లో కృష్ణంరాజు, విజయలలిత

హీగారు; శోభన్‌బాబుకు పెండ్లాం పిల్లలు కూడా వున్నారుగా; మరి లక్ష్మిని ఆయన ఎందుకు ప్రేమిస్తున్నాడని మీరడగొచ్చు; అయన లక్ష్మిని ప్రేమిస్తున్నది 'మాయనీ మమత' సినిమాలో.

'మాయని మమత' చిత్రాన్ని శ్రీ బాపయ్యసంతులు నిర్మించారు. శ్రీకామేశ్వరరావు దర్శకత్వం నెరపిన ఈచిత్రం పూర్ణా పిక్చర్స్‌ద్వారా విడుదలవుతుంది. నాయికా నాయకులుగా సరోజాదేవి, రామారావుగార్లు నటించారు.

* * *

# సినిమా

## మార్చి మార్చి ఇవ్వలేనిది మనసు

స్త్రీకి మాంగల్యమే శ్రీరామ రక్ష; ఆమెకు తనభర్త సాంగత్యమే జీవితరక్ష; స్త్రీకి ఒకసారే పెండ్లవుతుంది. పురుషుడిలాగా మళ్లీమళ్లీ పెండ్లి చేసుకునే హక్కు స్త్రీకి లేదు. అలావున్నా స్త్రీకి ఆవుద్దేశ్యం రాదు; కానీ మగవాడు స్త్రీని ఆటబొమ్మగా ఆడించడం, తన ప్రయోజనం తీరగానే త్రోసిపుచ్చడం అక్కడక్కడ జరుగుతున్నట్టు వింటున్నాం. అలాంటి అభాగ్యవతుల్లో విజయలలిత ఒకతె. విజయలలితను కృష్ణంరాజు తన చిలిపిమాటలతో నవ్వించాడు; శృంగార చేష్టలతో వలపు కురిపించాడు. ఆమెను తన అర్ధాంగినిగా గుడిలో పెళ్లి చేసుకున్నాడు. కొన్నాళ్లు ఆమె జీవితంలో వసంతాన్ని కురిపించాడు. ఆ తర్వాత ఎండమావులకు అప్పచెప్పాడు. పాపం విజయలలిత ఏం చేస్తుంది? తన దుర్భర జీవితానికి ఆవేదనపడసాగింది ఆమె తల్లి సూర్యకాంతం తన కూతురికి మరోవరుడ్ని వెతికింది. కృష్ణ పెండ్లి చూపులకు వచ్చాడు. వచ్చిన పెళ్లి పెద్దలు విజయలలితను పాటపాడమని బలవంతం చేసారు. గత్యంతరం లేక లలిత యిలా పాడింది.

పాడమంటే పాడుతాను
నవ్వమంటే నవ్వుతాను
చెక్కబొమ్మ చీరగట్టి
పెళ్లిఆటలు ఆడినాను
నాడు ఆడిన ఆటపెళ్లి
నేటి పెళ్లిని ఆటచేసెను
మళ్లీ మళ్లీ చేయలేనిది
పెళ్లిఒకటే ఆడదానికి
మార్చి మార్చి యివ్వలేనిది
మనసు ఒకటే జీవితానికి,— 'అని

వాపోయింది, ఇలాంటి హృదయాన్ని ద్రవింపచేసే బరువయిన సన్నివేశాన్ని దర్శకుడు మాధవరావు 'తాళిబొట్టు' చిత్రానికిగాను యిటీవల శారదాలో చిత్రీకరించారు.

'తాళిబొట్టు' చిత్రం మార్చి 27 న పూర్ణాపిక్చర్స్ ద్వారా విడుదలవుతుంది. శ్రీ వెంకటరామరాజు నిర్మించిన 'తాళిబొట్టు' చిత్రానికి ఆచార్యఆత్రేయ రచనా విభాగాన్ని, మహదేవన్ సంగీత సారథ్యాన్ని, మాధవరావు నిర్దేశకత్వాన్ని నిర్వహించారు. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను కృష్ణ, విజయనిర్మల, కృష్ణంరాజు, విజయలలిత, సూర్యకాంతం, రాజబాబు ప్రభృతులు పోషించారు.



"మాయనిమమత"లో సరోజాదేవి, రామారావు.



'ఖడ్గవీర'లో కాంతారావు, జ్యోతిలక్ష్మి

శైవవటారం లోన లొటారం అనేది కలిపాడు. తమ స్నేహానికి చిహ్నంగా వాక్యానికి ప్రతిరూపం నాగభూషణం; నాగభూషణం, రంగారావు గౌరవార్థం జయనకు రంగారావు సహాయం కావాల్సి ఒక విందు ఏర్పాటుచేశాడు. విందు కాగానే

## 'స్వార్థం కోసం చేసిన స్నేహం

వచ్చింది. రంగారావుపేరు వింటేనే కనువిందు కల్పించడానికి వలపుల వీర అపూర్వ అందరికీ హడల్. అందుకే జాణ విజయలలిత తన ఆటపాటలతో నాగభూషణం, రంగారావుతో చేతులు రంగారావును కవ్వించింది, మత్తెక్కించి



'ప్యార్ కా సప్నా'లో మాలాసిన్హా, అశోక్ కుమార్.

చిందీ:

మామా, ఓయ్‌మామా
స్వైర్, యిటురారా
నీకన్నా, తీరుమిన్నా;
కిలాడీ సింగన్నా
అద్దములాంటి మనసు నాదిరో
వద్దన్నా నిను వదలమరా

అంటూ రంగారావు వొడిలో వయ్యారంగా వాలిపోయింది విజయలలిత. ఈ వినోద భరిత సన్నివేశం సుప్రజాపిక్చర్స్ 'కిలాడీ సింగన్న' చిత్రంలో మిమ్మల్ని కవ్విస్తుంది.

సుప్రజాపిక్చర్స్ నిర్మిస్తున్న 'కిలాడీ సింగన్న' చిత్రానికి దర్శకనిర్మాత అయ్యన్‌మూర్తి. ముఖ్య పాత్రలను ఎస్వీ. రంగారావు, హరనాథ్, నాగభూషణం, వాణిశ్రీ, విజయలలిత, రాజబాబు పోషిస్తున్నారు.

## దర్శకుడయిన కథకుడు

అనేక విజయవంతమయిన జానపద చిత్రాలకు కథ, మాటలను సమకూర్చిన శ్రీ జి. కె. మూర్తి సవితాచిత్ర నిర్మిస్తున్న సాంఘిక చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు. ఈ చిత్రానికి కథ, దర్శకత్వాన్ని జి. కె మూర్తి, సంగీతాన్ని విజయా కృష్ణమూర్తి, ఛాయా గ్రహణాన్ని మోహన్‌లు నిర్వహిస్తున్నారు. మార్చి 14 న ప్రారంభమయిన 'చిట్టి చెల్లి' లోని ప్రధానపాత్రలను హరనాథ్, భారతి, రాజబాబు, రమాప్రభ, ఛాయాదేవి, త్యాగరాజు పెరుమాళ్ళు, నల్లరామ్మూర్తి, ఏ. వి. నాగేశ్వరరావు, జేవి రాణి ధరిస్తున్నారు.

## తోటలో పెళ్లి

'దిక్కుమొక్కు లేని వారికి దేవుడే దిక్కు' అంటారు. కాని దేవుడు ప్రత్యక్షంగా కనిపించడుగా. ఒక మనిషిద్వారా తన పనిని పూర్తిచేసుకుంటాడు దేవుడు. అందుకే అమ్మానాన్నల ముఖం చూడని వాణిశ్రీని గుమ్మడి చేరదీసి, కన్న కూతురికన్నా మిన్నగా పెంచి పెద్దదాన్ని చేశాడు. గుమ్మడి కుమారుడు కృష్ణ చదువు ముగించుకుని యింటికి తిరిగి వస్తాడు. ఇంట్లోనికి అడుగు పెట్టగానే

మహాలక్ష్మిలాంటి వాణిశ్రీ ఎదురవుతుంది. ఎవరీ అప్సరస అని కృష్ణ ఆశ్చర్యపోతాడు. అప్పటినుండి కృష్ణ మనసు, చూపు వాణిశ్రీమీదే లగ్నమైంది.

ఒకరోజు రాత్రి వాణిశ్రీ తోటలోని రెస్టుహౌస్‌లో 'లైఫ్' మేగజైనును చదువుతూ వుంటుంది. అదే సమయానికి కృష్ణ తోటలోకి వస్తాడు. అల్లంత దూరంనుండి వాణిశ్రీయొక్క అవయవ సోయగాన్ని ఆమె అందమయిన ముఖాన్ని చూశాడు. తిన్నగా వెళ్ళాడు. ఆమె కళ్ళు మూశాడు, మృదువుగా ఆమెను తాకాడు. మెత్తటి ఆమె శరీరాన్ని తన బాహుబంధంలో యిమిడ్చాడు. కృష్ణ చేసిన తొందరపాటుకు వాణిశ్రీ వణికిపోయింది. కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. ఎదురుగా వున్న దేముడి విగ్రహంముందు నిస్సహాయస్థితిలో నిలబడింది. కృష్ణ ఆమెను ఓదార్చాడు. వూరడించాడు. తన చేతనున్న మంగళసూత్రాన్ని ఆమె మెడలో కట్టాడు. 'నీకునేను అన్యాయం చెయ్యను' అని దేముడియెదుట ప్రమాణం చేశాడు. వాణిశ్రీ హృదయం ఆనందంతో నిండిపోయింది. సంతోషంగా కృష్ణను కౌగలించుకుంది. ఈ రసవత్తరమయిన దృశ్యం 'పచ్చని సంసారం'లో హైలైటుగా వుండేవిధంగా దర్శకుడు లక్ష్మీదీపక్ చిత్రీకరించారు. ఈ చిత్రం అతిత్వరలో లక్ష్మీఫిలింస్ ద్వారా విడుదలవుతుంది. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను కృష్ణ, రామకృష్ణ, గుమ్మడి, పద్మనాభం, రాజబాబు, వాణిశ్రీ, గీతాంజలి, సంధ్యారాణి, సూర్యకాంతం, విజయలలిత, కె. ఆర్. విజయ ధరిస్తున్నారు.

## అభయమిచ్చిన మొనగాడు

అందాలరాశి రాజశ్రీని కత్తివీరుడు కాంతారావు మనస్ఫూర్తిగా ప్రేమించాడు. కాంతారావుయొక్క ధైర్య సాహసాలను, నిర్మల మనస్తత్వాన్ని విని రాజశ్రీ తరించింది. అయినా తన ప్రాణనాథుణ్ణి



'అమ్మకోసం'లో విజయనిర్మల, కృష్ణ

చేసుకోవాలనుకుంది ఇద్దరి మనస్సులు కలిసాయి. ఇద్దరి భావాలు జోడయ్యాయి ఇద్దరు జల్సాగా షికారు కెళ్ళారు.

'చేతికి దొరికిన చిట్టెమ్మా, చిరాకు పడకే చిలకమ్మా' అంటూ కాంతారావు రాజశ్రీకి అభయహస్తం యిస్తాడు. ఈ దృశ్యం 'ఖడ్గవీర'లో కనిపిస్తుంది. శ్రీ జి. విశ్వనాథం డైరెక్టుచేస్తున్న ఈ చిత్రాన్ని కృష్ణంరాజు, శోభనాచలం గార్లు నిర్మిస్తున్నారు. శ్రీ మంద్రు సూర్యనారాయణ సమర్పించే 'ఖడ్గవీర'కు జయలక్ష్మి పంపిణీదారులు.

* * *

'వస్తేయిస్తా నా మూగమనసు
యిస్తేనస్తా నీ దోరవయసు, —

ఈపాట అరుణాచలం స్టుడియోలో మార్చి 9 న రికార్డు చెయ్యబడింది. శ్రీ సత్యం సంగీత సారథ్యంలో పిఠాపురం, ఈశ్వరి పాడారు ఈ పాటను. ప్రసాద్ స్టుడియోలో పద్మనాభం, గీతాంజలిపై దర్శకుడు శ్రీ బి. వి. ప్రసాద్ మార్చి 9, 10 తేదుల్లో చిత్రీకరించారు పై పాటను రాజశ్రీ శ్రీ రమణ చిత్ర రెండవ చిత్రానికిగాను] వ్రాశారు. ఈ చిత్రానికి [illegible]



'యాద్ గార్'లో నూతన.

# సినిమా

గ్రహాలు. శ్రీ చలం సమర్పించే ఈ చిత్రానికి మార్చి 9 న శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు స్విచ్ ఆన్ చేశారు నవయుగా శ్రీనివాసరావుగారు క్లాప్ కొట్టారు. తెలుగు చలనచిత్ర రంగ ప్రముఖులందరూ వచ్చి శ్రీ చలంను ఆశీర్వదించారు. తమిళరంగపు నాగేష్, కె. బాలచందర్, సుందరరాజన్, కుమార్ గార్లు వచ్చి శుభాశీస్సుల నందచేసారు.

* * *

హీరో నాగేశ్వరరావు ఎంత పనిచేసినా హుషారుగా వుండడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈమధ్య శ్రీ అక్కినేని ప్రోగ్రామ్సును పరిశీలిస్తే, ఈ వయస్సులో యింత చురుకుదనం ఆయనకు యెలా అబ్బిందా అనిపిస్తుంది.

హైద్రాబాద్ సారధి స్టుడియోలో షూటింగు పూర్తిచేసుకుని మరుదినమే మద్రాసు రావడం, రాగానే వీనస్ పిక్చర్స్ షూటింగులో పాల్గొనడం, మధ్యలో అనేక బయటి కార్యక్రమాల్లో పాలుపంచుకోవడం, వెనువెంటనే అవుట్‌డోర్‌కు వెళ్ళడం, వచ్చి ఒకరోజు సవేరాలో విశ్రాంతి తీసుకుందామనుకునే సమయంలో అనేక నిర్మాతలు కథలు వినిపించడం, తమ చిత్రాల్లో నటించాల్సిందిగా కోరడం, మరికొందరు కాల్‌షీట్లను గురించి ప్రస్తావించడం, వీటన్నింటికి వదుమ జర్నలిస్టులకు భేటీయివ్వడం — ఆయనకోసం పిక్చరు ప్రొజెక్షన్ యేర్పాటు చేసామంటూ రాత్రులు కూడా నిద్రలేకుండా చెయ్యడం — వీటన్నింటినీ, వీళ్ళందర్నీ శ్రీ అక్కినేని ఎలా ఎడ్జస్ట్ చెయ్యగలుగుతున్నారో మరి?

* * *

ప్రొడ్యూసర్స్ కంబైన్స్ ఈస్టుమన్ కలర్‌తో నిర్మిస్తున్న తెలుగు చిత్రం యొక్క అవుట్‌డోర్ షూటింగు మార్చి 16 నుండి 20 వరకు ఊటీలో జరిగింది. ఈ షెడ్యూలులో నాగేశ్వరరావు, శోభన్‌బాబు, వాణిశ్రీలు పాల్గొన్న దృశ్యాలను దర్శకుడు ఎస్. ఆర్. పుట్టన్న చిత్రీకరించారు.

* * *

మార్చి 20 ఊటీనుండి తిరిగివచ్చిన వాణిశ్రీ వెంటనే పల్నా షూటింగులో పాల్గొని మార్చి 25 న తూర్పుగోదావరికి బయల్దేరబోతూంది. ఎందుకో తెలుసా? జగపతి ఆర్టుపిక్చర్స్ 'దసరాబుల్లోడు' షూటింగులో శ్రీ అక్కినేనితో నటించడానికే, 'దసరాబుల్లోడు' చిత్రాన్ని శ్రీ వి. బి. రాజేంద్రప్రసాద్ డైరెక్టు చేస్తున్నారు.

* * *

అసాధ్యుడు + ఆరితేరినవాడు కలిస్తే అద్భుతమయిన ఫలితాలను యిస్తారు. శ్రీ అక్కినేని + శ్రీ ఆదుర్తి కలిసి స్థాపించిన సంస్థయే చక్రవర్తి సంస్థ. వీరి ఆశయం యెంత వుదాత్తమయినదో 'సుడిగుండాలు' నిరూపించింది. హీరోగా శ్రీ నాగేశ్వరరావు ఎంతటి విజయవంతుడో, దర్శకుడిగా శ్రీ సుబ్బారావు అంత వినుతికెక్కారు. వీరిద్దరి రెండవ ప్రయత్నమే 'మరో ప్రపంచం'. ఈ స్క్రిప్టులును బట్టి యిది మన మామూలు చిత్రాలకన్నా భిన్నంగా వుండగలదని పిస్తుంది సంఘానికి వుపయోగపడే నీతిని ప్రబోధించే సమస్యాత్మక సాంఘిక చిత్రమే 'మరో ప్రపంచం' శ్రీ ఫిలింస్ విడుదల చెయ్యనున్న ఈ ప్రయోజనాత్మక చిత్రం ప్రజలకు ప్రయోజనకారిగావుండి, ప్రజల ఆదరాభిమానాలను అందుకోగలదని ఆశించవచ్చు. కేవలం కాసుకోసంగాక ధ్యేయం కోసం చిత్రాలను నిర్మించడానికి నడుం కట్టిన శ్రీ అక్కినేని ఆదుర్తి గార్లు అభినందనీయులు.

* * *

'రాజసింహ', 'రాజయోగం' చిత్రాలను నిర్మించిన బి. వీ. రాజా మరొక శృంగారరస భరితమయిన జానపద చిత్రాన్ని నిర్మించడానికి నిశ్చయించారు. ఈ చిత్రానికి దర్శకుడు కే. ఎస్. ఆర్. దాసు కథను వ్రాసారు మాటలను కణ్వశ్రీ, సంగీతాన్ని సత్యం, కెమెరాను కన్నప్ప నిర్వహిస్తున్నారు దోనేపూడి కృష్ణమూర్తి సమర్పించే ఈ చిత్రం యొక్క షూటింగు మార్చి 17 న శారదాలో ప్రారంభమైంది. ముఖ్యపాత్రలను కాంతారావు, విజయలలిత, రామకృష్ణ, అనిత, రాజనాల, రాజబాబు, త్యాగరాజు, సురేఖ, కాశీనాథ్, వసంతకుమార్లు పోషిస్తున్నారు.

—శ్రీనివాస్



"గీత్" సెట్స్‌మీద మాలాసిన్హా.

**అవీ-ఇవీ...**

జయపూరు (రాజస్థాన్) ఆంధ్రవిజ్ఞానసమితివారు 8—3—70 తేదినాడు 'గవ్య' లకి సంబంధించిన ప్రదర్శన, ఉపన్యాసాలని ఏర్పరచారు. ఉపన్యాసకులు, గవ్యాల ప్రదర్శకులు ప్రొ. గుమ్మరాజు రాజారామారావుగారు. (ఒ. వి.)

**వివాహం**

గుంటూరు వాస్తవ్యులు శ్రీ ఆర్. వి. వి. ఎస్. ప్రసాద్ గారి కడపటి కుమార్తె చి. సౌ. ప్రభావతీదేవికి, మదరాసు వాస్తవ్యులు శ్రీయార్లగడ్డ వెంకటప్ప చౌదరిగారి కుమారుడు చి. శంభుప్రసాద్‌కు మదరాసులోని ఎడ్వర్డ్ ఇలియట్స్ రోడ్డులో గల రాజేశ్వరీ కల్యాణమండపంలో మార్చి 2వ తేది సాయంత్రం వైభవంగా వివాహం జరిగింది. వివాహమహోత్సవానికి పలువురు ప్రముఖులు విచ్చేసి వధూవరులను ఆశీర్వదించారు.

# పుస్తకాలు

## చిత్తూరుజిల్లా సాహిత్య చరిత్ర విమర్శనము

కర్త: కవిరాజశ్రీ శ్రీనివాసపురం—నరసింహాచార్యులు, క్రౌను 183 పుటలు. వెల 4 రూ. ప్రచురణ—నవ్యాంధ్రభారతి, పుంగనూరు. ప్రతులకు—డాక్టరు ఎస్. నరసింహాచార్యులు, ఆచార్య క్లినిక్, 4/144 సెట్టివారివీధి, మదనపల్లి—చిత్తూరుజిల్లా.

ఇదివరలో పేరుపడిన కథానికా రచయిత మధురాంతకం—రాజారాంగారు ఏభై పుటల్లో చిత్తూరు జిల్లా సాహిత్యచరిత్రను గురించి ఒక పుస్తకం వ్రాశారు. అందులోని లోపాలన్నిటినీ వెల్లడిస్తూ యీ పుస్తకం రచించబడింది. రాజారాంగారు రసవంతమయిన ధోరణిలో వ్రాసిన పుస్తకం బాగానే ఉన్నదని, అది చదివినప్పుడు తోచింది. దీనిని చదివాక— రాజారాంగారు విషయాలను సమగ్రంగా సేకరించకుండా దాన్ని ఎందుకు వ్రాశారా? అని ఎవరికైనా తోచకమానదు. చి. జి. సాహిత్య చరిత్రలో విడువబడిన పెక్కురు విద్వత్కవుల వివరాలతో పాటు, రాజారాంగారి లోపాలు విమర్శింపబడ్డాయి. తమకు పరిచితులైన— తమకునచ్చిన— కొందర్ని గురించే వ్రాసేరేమో? అని సందేహించవలసి వస్తుంది.

పూర్వం కొక్కొండ వారి ప్రసన్న రాఘవనాటకంపైని శ్రీ వేదంవారి విమర్శన అసలు గ్రంథంకంటె రెట్టింపు పెరిగి, చాలా ఘాటుగా కూడా ఉండినది. ఇదీ అదే ధోరణిలో సాగింది. ఆచార్యులుగారు విమర్శలో తమ పాండితీ ప్రకర్షను కూడా చూపించారు. ఇది విమర్శన గ్రంథం అయినా— సమగ్రంగా కాకపోయినా— చి. జి. సా. చరిత్రకంటే ఎన్నో విషయాలను ఎక్కువగా చెప్తూ ఉండడంవల్ల, దీనినే ఆజిల్లా సాహిత్య చరిత్రగా అనుకోవచ్చు.

పూర్వం విమర్శలు ఘాటుగానూ, వ్యక్తినిందలతోనూ ఉండేవి. ఇప్పుడా పద్ధతులు మారిపోయాయి, కాని యీ విమర్శకులు వెనకటి పద్ధతినే అనుసరించడం సరసంగా లేదు. చురుకుబలులు చాలా తగ్గించి వ్రాస్తే బాగుండును. శ్రీ ఆచార్యులుగారు తమ ధోరణిలో ప్రస్తుతం తిరుపతి, చిత్తూరులలో ఉండడం కారణంగా శ్రీరాళ్లపల్లి వారు, ఆచంట జానకిరాంగారు, పింగళి లక్ష్మీకాంతంగారు, టేకుమళ్ల కామేశ్వరరావుగార్లను కూడా చిత్తూరు జిల్లా వారినిగానే తెలపడం కొంత వింతగానే కానవస్తుంది.

ఈ చరిత్ర, తద్విమర్శనలవల్ల తెలుస్తున్నదేమిటంటే— ఇట్టి జిల్లా సాహిత్యచరిత్రలు కొందరికి తృప్తి కలిగించినా— ఆ జిల్లావారికే కొందరికి ఎక్కువ అసంతృప్తిని కలిగించి, అనైక్యతకూ దారి తీస్తాయని. ఉదారమైన సాహిత్యాభిమానం కలవారు ఇట్టి మాండలిక రచయిత చరిత్రలకు ప్రోత్సాహం ఇవ్వకుండా ఉండడం శ్రేయం. భాషా వాఙ్మయ సేవకు ఇదొక్కటే సాధనంకాదని గుర్తించవలసిందని మనవి.

## ఆంధ్రనాటకరంగచరిత్ర

రచయిత: శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, డెమ్మీ 34+855 పుటలు. వెల సాదా ప్రతి: 20రూ మేలుప్రతి 25 రూ., ప్రతులకు—రచయిత—రేణుక, 22, నాగార్జుననగర్, మద్రాసు—24.

ఏ కళనయినా కాలానుగుణంగా సంస్కరించి అభివృద్ధి పరచడానికి దాని పుట్టుపూర్వోత్తరాలూ, ప్రస్తుత పరిస్థితులు తెలుసుకోవడం ఎంతో అవసరం. తెలుగునాట ప్రధానంగా ఎంచబడుతున్న కళలలో నాటకకళ ఒకటి. ఈ నాటకకళను గురించి ఇదివరలో కొందరు కళావేత్తలు పరిశ్రమించి కొన్ని గ్రంథాలు రచించారు గాని, ఆ కళను గూర్చిన యావద్విషయాలనూ, కళారాధకుల చరిత్రలతోసహా ఒక చక్కని బృహద్గ్రంథాన్ని రచించినట్లు కానరాదు. తెలుగులో సమగ్రమైన నాటకరంగాన్ని గురించి వ్రాయబడిన యీ గ్రంథం ఆలోపాన్ని తీర్చింది.

కళయొక్క చరిత్రాన్ని ప్రామాణికంగా వ్రాయాలంటే అందులో అభిమానం ఉన్నంత మాత్రాన తగిన ప్రయోజనముండదు. ఆ కళలో అనక్తితో పాటు అభినివేశమూ, అనుభవమూ కూడా కావాలి. శ్రీ మిక్కిలినేనివారు నాటక కళలో పుట్టి, అందులోనే పెరిగి, పెక్కు నాటకాల్లో నటించి, నాటకాలు వెనుకపడిన యీ కాలంలో నాటకరంగానికి ప్రత్యామ్నాయమైన సినిమారంగంలో ప్రవేశించి సిద్ధహస్తులైనారు. నాటకకళను గురించి ఆమూలాగ్రంగా పరిశీలించి యీ గ్రంథాన్ని పదిహేనేళ్ల కిందటనే రచించి ఆంధ్రప్రదేశ ప్రభుత్వం వారు తెలుగుభాషా సమితి ద్వారా జరిపించిన పోటీలో మొదటి బహుమానాన్ని సంపాదించారు. ఆంధ్ర ప్రభుత్వ విద్యాశాఖ, రచయిత ఆప్తమిత్రులు పద్మశ్రీ అక్కినేనినాగేశ్వరరావుగారు సహకరించగా—ఇవ్వాడు ఆ బృహద్గ్రంథాన్ని వెలుగులోకి తెచ్చారు.

ఇందులో ఇరవైయారు ప్రకరణాలున్నవి. నాటకకళ ప్రారంభానికి పూర్వపు స్థితి మొదలుకొని, యిప్పటి స్థితివరకూ నాటకక్రమ పరిణామం చక్కగా పరిశీలించబడింది. జానపదగేయాలు, జంగంకథలు, తోలుబొమ్మలాటలు, కూచిపూడి భాగవతాలు, పగటివేషాలు, మున్నగు వాటితోసహా గతశతాబ్ది చివరి భాగం నుంచీ పున్న నటులను గురించీ, నాటకాలు—తత్కర్తలను గురించీ— దొరికినంత వరకూ ఛాయా చిత్రాలతోనూ, కొన్నిరేఖాచిత్రాలతోనూ ఎన్నోవిషయాలను తెలియజేశారు. ఆంధ్రనాటక రంగచరిత్రతోపాటు ఇతర— భారతీయ నాటకరంగాలక్రమ పరిణామం కూడా సంగ్రహంగా చెప్పబడింది. తెలుగు దేశంలోని నాటక సమాజాలను గురించీ, నాటక కళాపోషకులను గురించి వివరణలు ఉన్నాయి. నాటకకళను గురించి సమగ్రంగా పరిశీలించి రచించబడిన గ్రంథం నేనెరిగినంతవరకూ మరొకటి కానరాలేదు. ఇది నాటకకళాసర్వస్వమని చెప్పడం అతిశయోక్తి కాదు. పరిశ్రతంగా—ఆయా ప్రకరణాలలో సందర్భానుసారంగా కూర్చిన రేఖ చిత్రాలు గ్రంథానికి వింశోభను కూరుస్తున్నవి. ముద్రణ ఎంతో చక్కగా ఉన్నది. 'పద్మశ్రీ అక్కినేని'వారికి ఇది వారి చలనచిత్ర జీవిత రజితోత్సవపు కానుకగా అంకితమయింది. శ్రీ అక్కినేనివారి 'స్వీకరణ', డాక్టర్ రాజమన్నారుగారి 'తొలిపలుకు', డాక్టరునారాయణరెడ్డిగారి 'రంగ



# పుస్తకాలు

టిక్ ఈ గ్రంథానికి వన్నె కూర్చున్నవి. ఈ గ్రంథ రచనకూ, ప్రకటనానికీ తమకు స్ఫూర్తినీ, సహకారాన్ని చూపినవారినందరినీ పుస్తకానికి ఎక్కించి, కృతజ్ఞతను చూపిన శ్రీ మిక్కిలినేని వారి సహృదయత ప్రశంసింప దగినది.

నాటకరంగం సమగ్రచరిత్రను తెలుసుకోదలచిన వారు ఈ గ్రంథాన్ని చదివితే చాలు. ఎన్నో విషయాలను గ్రహించగలరు. తాము సంవత్సరాల తరబడి కృషిచేసి, నాటకకళను ఆకళించుకుని ఆ విజ్ఞానం అందరికీ సులభంగా అందేటట్లు చేసిన రచయిత ఆంధ్రులందరి మన్ననలకూ అర్హులు. గ్రంథాలయాల్లోనూ, విద్యాలయాల్లోనూ ఈ పెద్ద గ్రంథానికి చోటిచ్చి, శ్రీ మిక్కిలినేనివారి గొప్ప కృషిని సఫలం చెయ్యడం ఎంతయినా అవశ్యకం!

—ఆంగీరస

## గృహవైద్యం
## (హోమియోపతి)

(గ్రంథకర్త: నారపరాజు కోదండ రామయ్య, విక్ అండ్ కో, రేపల్లె: వెల రు. 1—50.

60 హోమియో మందుల ప్రయోజనాలను ఈ చిన్న పుస్తకంలో కోదండరామయ్యగారు వివరించారు. వారికి హెచ్. ఎం. పి (రిజిస్టర్డ్) "డిప్లమా" ఉన్నది. ఈ వైద్యంలో 40సంవత్సరాలు అనుభవం కలదని వారు 3వ పుటలో వ్రాశారు. "ఈ సులభ వైద్యం ప్రతియింటను' వాడుకలోనికి రావలయునని నా ఆశయము' అన్నారు. వైద్య విధానం మంచిదని ప్రచారం చేయదలిచే వారు ఇట్లా వ్రాయడంలో వింత ధ్వని ఉండక పోవచ్చును. కానీ, హోమియో వైద్యం సులభ వైద్యమా? కేవలం కొన్నిమందుల పేర్లూ, వాటి లక్షణాలూ తెలిసిన వారందరూ యీ వైద్యం చెయ్యవచ్చునా! వ్యాధి లక్షణాలు ఆధారంగా చికిత్స చెయ్యడమే హోమియో వైద్య విధానమా?

రోగి శరీరతత్వం, శరీరావయవాలు పనిచేసే తీరూ, అవి సరిగ్గా పనిచెయ్యకపోవడానికి కారణం వంటి వేవీ తెలుసుకోనవసరం లేదా? ఫలానా లక్షణానికి ఫలానా మందు అని నిర్ణయించడంలో పొరపాటు పడితే రోగికి హాని జరగదా? మోతాదు హెచ్చినను ఒకదాని కొకటిపొరబడి వాడినను నిరపాయ కరమైనవి హోమియో మందులనడం సబబా?

అంత మాత్రాన యీ పుస్తకం నిరుపయోగకరమయినదని విమర్శించుతున్నట్లు అభిప్రాయ పడరాదు. ఇందులో మూడు భాగలున్నవి. ప్రథమ భాగం వస్తుగుణము. 60 మందుల లక్షణాలనూ 20 అనుబంధపు మందుల లక్షణాలనూ ఈభాగంలో వివరించారు. రెండవభాగము—చికిత్స. తల, కన్ను ముక్కు, చెవి, కంఠము తదితర అవయవాలకు వచ్చే వ్యాధులనూ, వాటి నివారణకు ఉపయోగించవలసిన మందులనూ యీ భాగంలో వివరించారు. కొన్ని స్పెసిఫిక్ మందుల ప్రయోజనాలను మూడవ భాగంలో వివరించారు. బివల్ నోసోడ్స్ సంగతిని నాలుగవ భాగంతో పరిచయం చేశారు.

హోమియో వైద్య విధానమంటే అభిమానమున్న వారందరూ చదవతగిన పుస్తకమిది.

—వి. ఎస్. అవధాని ●

# ఉత్తరాలు
(4-వ పేజీ తరువాయి)

## సినిమా

13-3-70 నాటి సంచికలో కాన్పూరునుంచి విజయకుమారిగారి లేఖనన్ను కదలించింది. "అమ్మ కొంగు పట్టుకు తిరిగే కొడుకులు" అనగానే నా ఆలోచనలు మరో విధంగా పయనించాయి. వారు పేర్కొన్నది వేరైనా, నాకు మరో విధమైన ఆలోచనలు కలిగాయి. నేను వ్రాయదలచు కొన్న విషయం సినిమారంగానికి చెందినదైనా, సమస్య సార్వజనీన మైనది కాబట్టి పత్రికలో ప్రచురణార్హమే నను కొంటాను.

'తల్లా—పెళ్లామా?' చిత్రానికి కథ, దర్శకత్వమూ తామే నిర్వహించిన రామారావుగారు, చాలా గొప్ప—సజీవమైన—సమస్యను స్వీకరించారు. ఆయన చివరికి తేల్చి చెప్పదల్చుకొన్ననీతి "యువకుని ప్రేమలో భార్యకే కాదు—తల్లికీ సమానమైన భాగం వుండాలి" అని! యువకుని చేత భార్యకి బుద్ధి చెప్పించారు దర్శకులు. అయితే రామారావుగారు నిజంగా పొరబడ్డారనే చెప్పాలి (మను చరిత్రలో పెద్దనగారు పొరబడినట్లు) రామారావుగారి చిత్రంలో భార్య అత్తవారి యింటికి వచ్చిన నాటినుంచి వెళ్లిపోయే వరకూ ఆమె తప్పేమీ కనిపించదు. భర్త ఆమెను విస్పష్టంగా నిర్లక్ష్యం చేశాడు. "నేను జ్వరం వచ్చి పడుకుంటే' యెలావుంది?' అని అడగడానికి కూడా తీరుబాటులేదా?" అని భార్య అడగవలసి వచ్చిందంటే, అంతకన్నా అన్యాయం మరొకటి లేదు! ఒక్క ప్రోత్సాహపు మాట భార్యకియెంతో శక్తిని యిస్తుందనీ, తన నిర్లక్ష్యం ఆమెను విపరీతంగా క్రుంగ దీస్తుందనీ తెలుసుకోలేని మగవాడు అసలు పెళ్లే చేసుకో కూడదు! ఆ చిత్రంలో భార్య అత్తగార్ని యెక్కడా నిర్లక్ష్యం చెయ్యలేదు. బుద్ధి చెప్పవలసింది భర్తకేగాని, ఆమెకు కాదు!

ఇంతటి సజీవమైన సమస్యను స్వీకరించి చిత్రీకరించి నప్పుడు సమర్థవంతంగా చిత్రించక పోతే సమాజానికి ఉపకారంకంటే అపకారమే యెక్కువ జరుగుతుంది. 'అమ్మకూచి'కొడుకులు యీ చిత్రం చూసి మరీ రెచ్చి పోతారు!

అసలు ప్రస్తుతం కావలసిన నీతి అదికాదు. "యువకుని ప్రేమలో తల్లికేకాదు., భార్యకీ సమానమైన భాగం వుండాలి" అని చెబితే ప్రస్తుత పరిస్థితులకి సరిపోతుంది. ఎందుకంటే భార్యని దాసిగా చూడ్డం, తల్లిని గౌరవించడం అనేది మనకి చాలా కాలంగా వస్తున్న ఆనవాయితీ. మారవలసినది—యీ పరిస్థితే! తల్లికి గౌరవం యిచ్చి, భార్యని నిర్లక్ష్యం చేసే వారే యీ నాడు యెక్కువగా వున్నారు!

ఈ ఉత్తరం వ్రాయడానికి కారకులయిన విజయకుమారి గారికి ధన్యవాదాలు. తి. రా.గారి (శీర్షిక) కి అభినందనలు.

——సి. రవిశర్మ (విశాఖ.) ●



Editea, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# ఒకే ట్యూబుతో ఐదు రకాల ఫినిష్‌లు!

- □ వివిధోపయుక్తమైనది— ఒక ట్యూబును వివిధ అప్కొలైట్ బేస్ పెయింట్లతో వాడవచ్చును. వెంటనే మీకు నచ్చిన ఫినిష్‌లు— అద్దము వంటి మెరుగు, మందమైన మెరుగు, మేట్ (తళతళలాడని) మెరుగు, హేమర్, మెటాలిక్ వంటి ఫినిష్‌లు — వస్తాయి.
- □ వీటికి అప్కొలైట్ బేస్ పెయింట్లను ఎంచుకోండి: సింథెటిక్ ఎనామిల్, అక్రిలిక్ ఎమల్షన్, డెకోప్లాస్ట్ వాల్ ఫినిష్, సింథెటిక్ మేట్, హేమర్ మరియు మెటాలిక్ మరియు అక్రిలిక్ వాషెబిల్ డిస్టెంపర్.
- □ కావలసిన రంగు తక్షణమే తెచ్చేది మేజిక్‌టచ్.

## మేజిక్‌టచ్

కావలసిన రంగును తక్షణమే తెచ్చేది




ఎక్కడ రంగు కావలెనో
అక్కడ
ఏషియన్ పెయింట్స్

**ఏషియన్ పెయింట్స్**

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA




# రెమి ®

## రెమి టాల్కమ్ పౌడరు

ఉపయోగించండి

Manufacturers: REMY PERFUMS PRIVATE LIMITED,
263, Thambu Chetty St., Madras-1